# ఆస్ట్రియా ఆక్రమణ

నార్ల వెంకటేశ్వరరావు

నవయుగ ప్రచురణాలయం
పెదసనగల్లు (పోష్టు)
కృష్ణాజిల్లా

B

నార్ల వారి
ఇతర గ్రంథాలు

నేటి రష్యా
రష్యన్ కథలు
స్వదేశ సంస్థానాలు

A

*

*  *

నిరంకుశత్వాన్నీ

నాజీతత్వాన్నీ

సహించలేని ప్రియమిత్రులు

యస్. జి. ఆచార్యగారికి

*

*  *

# ప్రకాశకుల మనవి

మా ప్రథమప్రచురణ 'రష్యన్‌కథలు' మే మనుకోనంతగా ప్రజామోదం పొందింది. అందుకు, మేము పాఠకలోకానికి కృతజ్ఞులం.

మా ద్వితీయ ప్రచురణగా నార్లవారి 'ఆస్ట్రియా ఆక్రమణ' ప్రకటిస్తున్నాము. ప్రథమప్రచురణకు చూపిన ఆదరణ ఈద్వితీయ ప్రచురణకుకూడా పాఠకలోకం చూపుతుందని ఆశిస్తున్నాము.

'డిక్టేటర్ల' నిరంకుశత్వం ప్రబలంగావున్న ఈరోజుల్లో 'ఆస్ట్రియా ఆక్రమణ' డిక్టేటర్ల దురాలోచన తెలుసుకోవడానికి తోడ్పడుతుంది.

'ఆస్ట్రియా ఆక్రమణ' జరిగి దాదాపు నాలుగు నెల లయి నప్పటికీ 'ఆస్ట్రియాకు' జరిగిన అన్యాయం యీనాటికీ మన హృదయాల్లో ప్రతిధ్వనిస్తూనే ఉన్నది. అందువల్ల,—'ఆస్ట్రియా ఆక్రమణ' ఎలాజరిగిందో తెలుసు

కోవడానికి ప్రతివారూ కుతూహలపడతారనే ధైర్యంతో ఈ ప్రచురణ బయటికి తీసుకొని రా సాహసిస్తున్నాము.

మా ఆశయాలకు అనుగుణంగా ఈ పుస్తకంతో పాటు 'స్వదేశసంస్థానాలు' కూడా ప్రకటిస్తున్నాము.

తమ పుస్తకాల్ని ఇచ్చి మాకు తోడ్పడుతున్న నార్ల వారికి మా నమస్కారాలు.

ఇంకా,— అనేక పుస్తకాలను త్వర, త్వరగా ప్రచురించబోతున్నాము. పాఠకలోకం మా ప్రచురణాలను ఆదరిస్తూ మాకు చేయూత యివ్వాలని మనవి.



# 1

"ఇది నా జీవితంలో అతి మహత్తరమైన దినం... నేడు నా జీవన కర్తవ్యాన్ని పరిపాలించుకున్నాను"— ఆస్ట్రియా ఆక్రమణ చేసిన వెంటనే హిట్లర్ అన్నట్టి మాట లివి. హిట్లర్ ఆస్ట్రియాలో జన్మించాడు; జర్మనీకి నాథు డయ్యాడు. పర రాజ్యం జర్మనీ తన పాదాక్రాంతం కావడమూ, జన్మభూమి ఆస్ట్రియా తన అధికారాన్ని గుర్తించకపోవడమూ అతడికి అవ మానంగా తోచింది; బాధాకరం అనిపించింది. అంచేతనే అతడు ఎప్పుడు తరుణం లభిస్తుందా, ఎప్పుడు ఆస్ట్రియాను వశపరుచు కుందామా అని తహతహలాడాడు. చివరికి ఆ తరుణం లభిం చింది, ఆతడి కోర్కె ఈడేరింది. ఇక అతడు "ఇది నా జీవి తంలో అతి మహత్తరమైన దినం" అనీ, "నేడు నా జీవన కర్తవ్యాన్ని పరిపాలించుకున్నాను" అనీ అనడంలో ఆశ్చర్యం లేదుగా!

ఆస్ట్రియాను ఆక్రమించుకో గలిగినందుకు హిట్లర్ గర్వపడుతున్నాడు. అత డిలా గర్వపడ్డంలో తప్పేమీ లేదు కూడా! కాని, తక్కిన ప్రపంచం మాత్రం ఇందుకు సిగ్గుపడాలి.

ఎంచేతనంటే,—హిట్లర్ పొందే ప్రతి విజయమూ మానవ స్వాతంత్ర్యానికి ఒక వజ్రాఘాతం; నాగరికతా వికాసానికి ఒక తీవ్ర ప్రతిబంధకం; ధర్మదేవత హస్తాలకు ఒక నూత్న శృంఖలం.

హిట్లర్ ఆస్ట్రియాను ఆక్రమించడం తక్కిన ప్రపంచానికి లజ్జాకరం మాత్రమే కాకుండా, ప్రాణోపద్రవకరం కూడా! ఎందువల్ల నంటే,— హిట్లర్ విజయం నాజీ తత్వ విజయం; నాజీతత్వ విజయమే యుద్ధదేవత విజయం. పతనమైపోయిన జర్మన్ రాజ్యాన్ని తిరిగిశక్తిమంతంగా చెయ్యడానికీ, శిథిలమైపోయిన జర్మన్ సామ్రాజ్యాన్ని పునర్నిర్మాణం చెయ్యడానికీ సైనికశక్తిని మించినసాధనం లేదని హిట్లరు నమ్మకం. ఇంతే కాదు. ఏదైనా ఒకజాతి పైకిరావాలంటేనూ, ఏదైనా ఒక దేశం ప్రపంచప్రాధాన్యతను పొందాలంటేనూ, అనలు మానవుడు అభ్యున్నత పథాల మెట్టాలంటేనూ, యుద్ధం అవసరమని అతడివిశ్వాసం. అతడిదృష్టిలో యుద్ధం వర్జనీయం కాదు,—వాంఛనీయం. అంచేతనే అతడు జర్మన్ దేశాన్ని విపులసైనికశిబిరంగా మార్చాడు. ఇట్టి స్థితిలో తాను పొందే ప్రతి విజయమూ తాను ఉపాసిస్తున్న యుద్ధదేవత అనుగ్రహాఫలితమే నని అతడు భావిస్తాడు. ఇలా భావించి, తన ఉపాసనను మరింత యెక్కువ చేస్తాడు. దీన్నిబట్టి స్పష్టపడే విషయం ఇది: హిట్లర్ ఒక కొత్త విజయాన్ని పొందాడంటే, ప్రపంచం యుద్ధదేవత పిడికిలిలో మరింత గట్టిగా చిక్కుకున్న దన్నమాట!

ఆస్ట్రియన్ ప్రజలదీ, జర్మన్ ప్రజలదీ ఒకటే జాతి; ఒకటే భాష; విజ్ఞానం కూడా చాలావరకు ఒకటే! అంచేత ఆస్ట్రియా జర్మనీలు ఏకం కావడంలో తప్పేమీలేదు. అయితే హిట్లర్‌లాంటి దురాశాపరుడూ, దుర్నీతిపరుడూ, దురహంకారీ జర్మనీకి ప్రభువై వుండగా ఈ కలయిక జరగడం జర్మన్ జాతి వారికే కాకుండా, సర్వప్రపంచానికి అరిష్టదాయకం!

## 2

ఆస్ట్రియా స్వతంత్రంగానైనా వుండవలసింది; లేదా, జర్మనీలో హిట్లర్ నిరంకుశ ప్రభుత్వం ఏర్పడ్డానికి పూర్వమే—అంటే జర్మనీ ప్రజాస్వామ్యంగా వున్నప్పుడే—దానిలో చేరైనా పోవలసింది. ఇందులో మొదటి విధంగా జరిగినట్టయితే హిట్లర్‌కు నేడు ఒక విజయం సిద్ధించిందనిగాని, అందుమూలంగా అతడి దిగ్విజయ తృష్ణ అధికమౌతుందనిగాని ప్రపంచం విచారించవలసిన అగత్యం కలిగేదికాదు. ఇక రెండో విధంగా జరిగినట్టయితే, అసలు జర్మన్ ప్రజాస్వామిక ప్రభుత్వం కూలిపోవడంగాని, హిట్లర్ లాంటివాడు అధికారానికి రావడంగాని సంభవించేదికాదు. ఈ రెండు విధాలాకూడా జరగకపోవడానికి కారణం— బ్రిటన్, ఫ్రాన్సు రాజ్యాలే!

1914-18 నాటి మహాసంగ్రామం తర్వాత బ్రిటన్-ఫ్రాన్సులు యూరప్ 'మ్యాప్'ను తమకు అనుకూలంగా

దిద్దుకున్నాయి. ఇలా దిద్దుకోవడంలో అవి ఆస్ట్రియాను స్వతంత్రంగా మనలేని నిస్సహాయస్థితికి తెచ్చాయి.

1914-18 నాటి యుద్ధానికి పూర్వం ఆస్ట్రియా ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్యంలో ప్రధానభాగంగా వుండేది. అప్పుడు దాని విస్తీర్ణం 1,16,000 చదరపు మైళ్ళు; జనసంఖ్య యించుమించుగా మూడు కోట్లు. ఇక ఆ యుద్ధానంతరం దాని విస్తీర్ణం * 32,000 చదరపు మైళ్ళు ; జనసంఖ్య 65 లక్షలు. చాలా ఘోరమైన నిస్సహాయస్థితినే తెలియజేస్తాయి — ఈ అంకెలు. కాని, నిజస్థితి ఈ అంకెలు తెలిపేదానికంటె ఎన్నో రెట్లు ఘోరమైంది.

విస్తీర్ణం తక్కువైనా, ఎక్కువైనా, జనాభాకు తగిన పంట పండుతూవుంటేనూ, పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలు దొరుకుతూవుంటేనూ, ఎగుమతి దిగుమతులు ఒకదానితో ఒకటి తులదూగుతూవుంటేనూ, పల్లెలూ పట్టణాలూ ఒకదాన్ని మరొకటి మింగివేశేలా వుండకపోతేనూ, ఏదేశమైనా సరే సుఖంగానే బతకగలదు. వీటిలో ఒక్క సౌకర్యానికైనా యుద్ధానంతరపు ఆస్ట్రియా నోచుకోలేదు.

---

*ఐరోపా మహాసంగ్రామానంతరపు ఆస్ట్రియా క్షేత్ర విస్తీర్ణాన్ని గురించి వ్రాస్తూ, "ఇన్‌సైడ్ యూరప్" లో జాన్ గన్థర్ ఈ హాస్యకథను చెప్పాడు: టైరోల్ ప్రాంతీయు లిద్దరు షికారు వెడదామనుకున్నారట. అప్పుడు వారిలో ఒకడు "ఆస్ట్రియా చుట్టూ తిరిగి వద్దామా?" అన్నాడట ఇందుకు రెండోవాడు "కాలు సాగకముందే మళ్ళీ ఇంటికి తిరిగి రావడమా?" అని అభ్యంతరం చెప్పాడట!

## ఆస్ట్రియా ఆక్రమణ

ఇంతకుపూర్వమే ఒకసారి చెప్పినట్లు, యుద్ధానంతరం ఆస్ట్రియా విస్తీర్ణం 32,000 చదరపు మైళ్ళు. దీనిలో నూటికి 90 వంతులు కేవలం పర్వత ప్రాంతమే! ఇంతేకాదు. మొత్తం విస్తీర్ణంలో నూటికి 40 వంతులు అడవుల మయం! పోతే, ఆస్ట్రియా భూఖండంలో ఏనాలుగోవంతో మాత్రం సేద్య యోగ్యమైంది. దీనిలో పండేపంట ఆస్ట్రియాప్రజలకు ఏడాదిలో మూడు, నాలుగు నెలల గ్రాసానికైనా సరిగా సరిపోదు!

ఇట్టి పరిస్థితిలో జీవనోపాధికి మార్గం పరిశ్రమలే! 1914–18 నాటి యుద్ధానికి పూర్వం ఆస్ట్రియాకు విశేష ఖనిజ సంపత్తి వుండేది. దాని ఆధారంతో అది అనేక పరిశ్రమల్ని కొనసాగిస్తూ, వాటిద్వారా సుఖజీవనం చేస్తూవుండేది. అయితే, యుద్ధానంతరం ఆస్ట్రియన్ రాజ్యఖండంతోపాటు చాలా ఖనిజ సంపత్తికూడా అన్యాక్రాంతమై పోయింది. దీని ఫలితం— ఆస్ట్రియన్ పరిశ్రమలు అధోగతిపాలుకావడం!

పోయిన ఖనిజసంపత్తి పోగా, ఆస్ట్రియాకు చాలా ఇనుము మిగిలింది. అంచేత అది ముడి ఇనుమునూ, దానితో తయారైన వస్తువుల్నీ ఎగుమతి చెయ్యవచ్చును. ఇంతేగాక దానికి చాలా కలపకూడా వుంది. ఈ కలపవల్లనూ, కలప ద్వారా— అంటే "వుడ్‌పల్ప్" ద్వారా— తయారయ్యే కాగితాన్నీ, అది ఎగుమతి చెయ్యవచ్చును కూడా. ఈ ఎగుమతులు సవ్యంగా జరిగితే, దాని పొట్ట అది పోసుకోగలదు.

కాని, ఇందుకుకూడా ప్రతిబంధకాలే ఏర్పడ్డాయి. ఈ ప్రతిబంధ కాలలో ముఖ్యమైనవి రెండు. వాటిలో మొదటిది,—ఆస్ట్రియా ఓడరేవులు అన్నికూడా అన్యాక్రాంతమైపోవడం; అది సముద్ర తీరానికి అందుబాటులో లేని రాజ్యం కావడం. పోతే, రెం డోది,—ఇరుగుపొరుగు రాజ్యాలు అన్నికూడా స్వజాతీయ పరిశ్రమల సంరక్షణకోసం పూనుకోవడం; ఆస్ట్రియా ఎగు మతులమీద సుంకాల్ని విధించడం.

ఈ చిక్కు లన్నిటితోపాటు ఆస్ట్రియా ఇంకొక వింత పరిస్థితిని కూడా ఎదుర్కొనవలసివచ్చింది. అది యేమంటే— మొత్తం జనాభాలో దాదాపు మూడు వంతులు 'రాజధానీ నగరమైన వియన్నాలో కేంద్రీకృతం కావడం! ఒక్కచోట— ఒక్కనగరంలో—ఇంత జనాభా కేంద్రీకృతమైతే, సాధారణ పరిస్థితులలోనే దాని పోషణ జరగడం కష్టసాధ్యం. ఇక, ఆస్ట్రియా విపరీత పరిస్థితులలో అది కేవలం దుస్సాధ్యమే!

ఒకవైపున సేద్యానికి అంతగా అవకాశాలు లేకపోవ డం, ఇంకోవైపున పరిశ్రమలు క్షీణించిపోవడం, ఇందుకుతోడు ఎగుమతి దిగుమతులకు ప్రతిబంధకాలు ఏర్పడ్డం, ఇది చాల దన్నట్టు జనాభాలో మూడోవంతు ఒక్కనగరంలో కేంద్రీ కృతం కావడం—ఇంతటి ఘోర పరిస్థితులలో ఆస్ట్రియా స్వతంత్రంగా జీవించగలగడం సాధ్యమా? కాదు,—ముమ్మా టికీ కాదు!!

# 3

ఆస్ట్రియా తన దైన్యస్థితిని గమనించింది; తాను స్వతంత్రంగా జీవించ లేనని గ్రహించింది. అంచేత అది కొత్తగా ఏర్పడ్డ జర్మన్ రిపబ్లిక్‌లో చేరిపోవాలని అనుకుంది. అయితే, బ్రిటన్- ఫ్రాన్సు రాజ్యాలు ఇందుకు అడ్డు వచ్చాయి!

జర్మనీతో చేరిపోవడానికి ఆస్ట్రియా చేసిన మొదటి ప్రయత్నం 1919 లో. ఆసంవత్సరంలో ఆస్ట్రియన్ నేషనల్ అసెంబ్లీ—ఇది యుద్ధానంతరం ఏర్పడ్డ ఫెడరల్ సంస్థ—జర్మనీతో ఐక్యతను అభిలషిస్తూ ఒక తీర్మానాన్ని చేసింది. ఈ తీర్మానాన్ని చెయ్యడమే తడవు— 'దీనిని మేము సహించము సుమా!' అని బ్రిటన్ – ఫ్రాన్సులు బెదిరించాయి. తర్వాత 1921 లో ఆస్ట్రియా తొమ్మిది రాష్ట్రాలలోనూ మూడు (టైరోల్, సాల్జ్‌బర్గ్, స్టైరియా) రాష్ట్రాలు జర్మనీతో కలసి పోవడానికి విడిగా ఒక ప్రయత్నం చేశాయి. బ్రిటన్–ఫ్రాన్సులు ఈ ప్రయత్నాన్ని సయితం సాగనివ్వలేదు. ఆ తర్వాత 1922 లో తిరిగి ఆస్ట్రియా జర్మనీతో ఐక్యాన్ని కోరడమూ, తిరిగి బ్రిటన్–ఫ్రాన్సులు దీన్ని ప్రతిఘటించడమూ జరిగింది.

వరసగా ఇన్నిసార్లు ఈ రెండు రాజ్యాలూ ఆస్ట్రియా ఆశయాన్ని విఘాతం చెయ్యడానికి కారణాలు ఇవి:

మొదటి కారణం: ఆస్ట్రియా జర్మనీలో చేరిపోతే, జర్మనీ జనసంఖ్య దాదాపు 70 లక్షలు పెరుగుతుంది. జర్మనీ జనసంఖ్య $6\frac{1}{2}$ కోట్లు అనీ, తన జనసంఖ్య 4 కోట్లు మాత్రమేననీ, ఇందువల్ల జర్మనీకి అధిక సైనిక శక్తి వున్నదనీ, ఇది తనకు ఎప్పటికైనా ప్రమాదకరమనీ ఆక్రోశించే ఫ్రాన్సు, జర్మనీ జనసంఖ్య—ఆస్ట్రియా కలయికతో—ఇంకొక 70 లక్షలు పెరగడానికి సమ్మతిస్తుందా? ఇది కల్ల.

ఇక, రెండో కారణం: డాన్యూబియన్ ప్రాంతానికి* అంతటికీ సైనిక దృష్టిలో ఆయువుపట్టు వంటిది – ఆస్ట్రియా. ఆస్ట్రియా రైళ్ళను చేతిలో పెట్టుకున్న ఏ సైన్యమైనా సరే, డాన్యూబియన్ రాజ్యాలమీద అతిసులభంగా దైత్రియాత్ర చెయ్యగలదు. ఇటువంటి అవకాశాన్ని బ్రిటన్ – ఫ్రాన్సులు చూస్తూ చూస్తూ జర్మనీకి ఇవ్వగలవా?

---

*డాన్యూబ్ అనే నది జర్మనీ దక్షిణభాగంలో పుట్టి, ఆస్ట్రియా-హంగరీ దేశాలగుండానూ, బల్గేరియా-రుమేనియా రాజ్యాల సరిహద్దులగుండానూ ప్రవహించి, బ్లాక్ సీ లో పడుతున్నది. వియన్నా, బుడాపెస్ట్, బెల్‌గ్రేడ్ మొదలయిన ప్రధాననగరాలు ఈ నదీతీరం మీదనే వున్నాయి. డాన్యూబ్ ప్రవహించే రాజ్యాలన్నింటినీ కలిపి, డాన్యూబియన్ ప్రాంతం అని అంటారు.

పోతే, మూడో కారణం: బర్లిన్ నుంచి, బాగ్దాద్‌కు పోవడానికి వియన్నాయే దారి. అంచేత ఆస్ట్రియా జర్మనీతో కలిసిననాడు పర్షియా, సిరియా, ఇరాక్ మొదలైన దేశాలలో జర్మనీకి పలుకుబడి ఏర్పడుతుంది. ఈ అవాంతరాన్ని తప్పించడానికే గత యుద్ధంలో ఒక కోటిమందిని బలి పెట్టవలసివచ్చింది. ఇంత బలి పెట్టిన తర్వాత, బర్లిన్—బాగ్దాద్ నగరాల్ని కలవనివ్వడమే!

ఇక, చివరి కారణం: ఆస్ట్రియా బ్యాంకులకు బాల్కన్ రాజ్యాలతో (రుమేనియా, బల్గేరియా, యుగోస్లావియా, గ్రీసు, అల్బానియా) చిరకాలంనుంచీ లావాదేవీలు వున్నాయి. ఈ ఆస్ట్రియా బ్యాంకులు జర్మనీ వశమైతే, దానికి ఆర్థికంగా బలం ఏర్పడుతుంది. ఇది బ్రిటన్-ఫ్రాన్సులకు అనర్థకం కాదూ?

స్వతంత్రంగా బ్రతకడానికి తగిన దార్ఢ్యంలేదు. పోనీ, జర్మనీతో కలిసిపోదామా అంటే, అందుకు బ్రిటన్-ఫ్రాన్సులు అంగీకరించవు. ఈస్థితిలో ఏమీ తోచక ఆస్ట్రియా తన దృష్టిని ఇటలీవైపుకు మరల్చింది. ఆస్ట్రియాకూ, ఇటలీకీ జాతిలోగాని, భాషలోగాని, విజ్ఞానంలోగాని, మరి దేనిలోగాని ఏమీ సంబంధం లేదు. కేవలం సంబంధం లేక పోవడమేకాదు,— వీటిమధ్య చాలా వైరుధ్య మున్నది కూడా! అయినప్పటికీ ఆస్ట్రియాకు ఇటలీకంటె మరిదిక్కు కనబడలేదు. అంచేత అది

ఇటలీతో కరెన్సీ విషయంలోనూ, సుంకాల విషయంలోనూ, ఏదైనా ఏర్పాటు చేసుకుందామని అనుకుంది. ఈ ఏర్పాటు జరిగితే, ఆస్ట్రియా ఇటలీకి సామంత రాజ్యమైపోయినట్టే! ఇటాలియన్ సరిహద్దులు మధ్యయూరప్ వరకు పాకినట్టే! అంచేత ఫ్రాన్సు, యుగోస్లావియా, జకోస్లావాకియా రాజ్యాలు అడ్డుపడి, ఈ ఏర్పాటును జరగనివ్వలేదు.

ఆస్ట్రియా ఒక ఘోరాపరాధాన్ని చేసింది. అది ఏమంటే,—ఐరోపా మహాసంగ్రామంలో ఓడిపోవడం. అంచేత, అది ఎన్ని కష్టాలనైనా పడాలి; ఎంతటి అవమానాలనైనా భరించాలి. పరాజితదేశంగతి ఏనాడూ ఇంతే!

## 4

స్వతంత్రంగా బ్రతకలేనివాణ్ణి "నీవు ఇతరులపంచను చేరడానికి వీలు లేదు" అని శాసిస్తే, ఇక వాడిగతి వస్తు పడు కోవడమేగదా! 1919 మొదలు 1922 వరకు ఆస్ట్రియా పని ఇంతే అయింది. ఆరోజులలో ఆస్ట్రియా — ముఖ్యంగా వియన్నా— కూటికీ గుడ్డకూ గతిలేక పడిన బాధలు ఇన్నన్ని కావు. అంతకు ముందువరకూ యూరపియన్ సభ్యతకూ, విజ్ఞానానికీ కేంద్రంగా విలసిల్లిన ఒక ప్రాచీన దేశమూ, ఒకమహా నగరమూ ఈ విధంగా మలమల మాడిపోవడాన్ని చూడలేక,

అమెరికా వారు కొంత ధనసహాయాన్ని పంపించారు. దీన్ని చూచి బ్రిటిష్ పార్లమెంటుకూడా కొంత ధర్మనిధిని మంజూరు చేసింది. ఇలా బిచ్చాన్ని వెయ్యడంవల్ల బ్రిటన్, అమెరికాలకు "మేము ఎంతటి ధర్మకార్యాన్ని చేశాము!" అని తమను తామే పొగడ్డించుకోడానికి అవకాశం కలిగితే కలిగిందేమో గాని, ఆస్ట్రియా ఆకలి తీరనూలేదు; దాని కష్టాలు ఈడేరనూలేదు.

పరిస్థితులు అంతకంతకు క్లిష్టం కాగా తన మనుగడకు ఋణాన్ని ఇప్పించవలసిందిగా ఆస్ట్రియా నానాజాతిసమితికి మహజర్లను పంపుకోసాగింది. మొదటిలో ఈ మహజర్లను ఎవ్వరూ ఖాతిరీ చెయ్యకపోయినా, 1922 అక్టోబరులో - ఇక తప్పదని అనుకుని కాబోలు!— బ్రిటన్, ఫ్రాన్సు, జెకోస్లొవాకియాలు తమ పూచీమీంద, తమ దేశీయులచేత, నానాజాతి సమితిద్వారా, 2 కోట్ల 70 లక్షల పౌనుల ఋణాన్ని ఇప్పించాయి. ఈ ఋణాన్ని ఇప్పింమస్తూ, అవి — అంటే బ్రిటన్, ఫ్రాన్సు, జెకోస్లొవాకియాలు — కోరిన షరతులు ఇవి:

(1) జర్మనీలో చేరిపోవాలనే ఉద్దేశాన్ని ఆస్ట్రియా పూర్తిగా వదలిపెట్టాలి. (2) ఆస్ట్రియన్ ప్రభుత్వాదాయం లోనుంచి సాలీనా వాయిదాల మీంద ఋణాన్ని తీర్చాలి. (3) వాయిదాలు సరిగా చెల్లుబడి కావడానికిగాను ఆస్ట్రియన్ ప్రభుత్వాదాయాన్ని అజమాయిషీ చెయ్యడానికి

నానాజాతి సమితి ఒక కమీషనర్-జనరల్‌ను నియమించాలి. (ఈ షరతు ప్రకారం నియమితుడైన కమీషనర్-జనరల్ పేరు డాక్టర్ జిమ్మర్‌మన్. ఇతడు డచ్చివాడు.) ఋణంమీద నూటికి సాలుకు 7½ వడ్డీని చెల్లించాలి (ప్రభుత్వ ఋణాలకు సంబంధించినంతవరకు ఈ వడ్డీరేటు చాలా హెచ్చు).

కూటికి గతిలేక అప్పులకోసం దేవులాడేవాడు తన ఆతురతకొద్దీ "మూడోనాటికి నీ డబ్బు ముదుపుగా తెచ్చియిస్తా" నని మాటిస్తే ఇస్తాడుగాని, ఆ మాట నిలుపుకోవడం అతడి తరమా? ఆస్ట్రియా పనికూడా సరిగా ఇంతే అయింది. మొదటి ఒకటి రెండింటి తర్వాత, అది వాయిదాలను కట్టలేకపోయింది. ఆస్ట్రియా వాయిదాలను కట్టలేకపోతే, వాటిని తామే చెల్లించుకోవాలి గనక, బ్రిటన్, ఫ్రాన్సు, జెకోస్లావాకియా ప్రభుత్వాలు పాతఋణాన్ని తీర్చడానికి గాను కొత్త ఋణాన్ని యిచ్చాయి. ఈ తంతు ఇలానే అనేకసార్లు జరిగింది.

ఋణాన్ని అంతకంతకు అధికంగా పుచ్చుకోవడంవల్ల ఆస్ట్రియా కష్టాలు పెరిగినవేగాని, తరగలేదు. ఇందుకు నిదర్శనం క్రింది అంకెలు:

ఆస్ట్రియన్ ప్రభుత్వంవారి సాలీనా ఆదాయంలో దాదాపు మూడువంతులు విదేశపు ఋణాల వడ్డీకింద చెల్లిపో సాగింది. ఇందుకు తోడు ఆస్ట్రియా ఎగుమతులకంటె దిగు

మతులు హెచ్చు కావడంవల్ల జాతీయ ఋణం సగటున సాలుకు 2 కోట్ల 40 లక్షల చొప్పున వృద్ధికాజొచ్చింది. 1913లో ఆస్ట్రియాలోని లిమిటెడ్ కంపెనీలమీద వున్న పెట్టుబడిలో నూటికి 80 వంతులు 1930 నాటికి నష్టంకింద చెల్లిపోయింది. విదేశాలకు వడ్డీ ముడువును చెల్లించడానికి గాను ఆస్ట్రియన్ ప్రభుత్వం తన ఉద్యోగుల జీతాలను నూటికి 30 వంతుల చొప్పున తగ్గించవలసివచ్చింది. 1930 నాటికి ఆస్ట్రియన్ కార్మికుడి కూలి బ్రిటిష్ కార్మికుని కూలిలో సగానికి సగంవరకు తగ్గిపోయింది. ఇంత తక్కువ కూలికైనా పని దొరకడం కష్టం కాసాగింది. 1930లో ప్రతి ముగ్గురు ఆస్ట్రియన్ కార్మికులలోనూ ఒకడు నిరుద్యోగి!

తమ ఋణాలవల్ల ఆస్ట్రియాను ఇంత దైన్యస్థితికి తెచ్చినా, బ్రిటన్, ఫ్రాన్సు, జెకొస్లొవాకియా రాజ్యాలు తాము దానికి ప్రాణాన్ని పోసినట్లు గర్వపడ్డాయి. చావసిద్ధంగా వున్నవాడికి మందు మాకుల్ని పోసి, వాడి బాధను మరికొంత కాలంపాటు పొడిగించి 'నేను ఎంత ఘనకార్యాన్ని చేశానో, చూచావా?' అని గర్వపడ్డం ఎంత లక్షణంగా వుంటుందో, ఇదికూడ అంతే!

# 5

క్లిష్టమైన ఆర్థిక పరిస్థితులవల్ల అసలే క్రుంగి కృశీభూతమై వున్న ఆస్ట్రియాకు, 1930 లో ప్రపంచ వ్యాప్తమైన వర్తక మాంద్యం ఏర్పడ్డం "మూలుగుతున్న నక్కమీద తాటిపండు పడ్డ" చందం అయింది. అప్పుడిక కష్టాల్ని సహించలేక, జర్మనీతో కనీసం సుంకాల విషయంలోనైనా ఐక్యతను (కస్టమ్సు యూనియన్) కూర్చుకోవాలని అది నిశ్చయించుకుంది.

ఇలా నిశ్చయించుకుని అది జర్మనీతో రాయబారాల్ని ప్రారంభించింది. ఆస్ట్రియా తరఫున ఈ రాయబారాన్ని నడిపినవాడు, ఆస్ట్రియన్ ఛాన్సలర్ డాక్టర్ షోబర్ (ఇతడు పోలీసు కానిస్టేబుల్‌గా జీవితాన్ని ప్రారంభించాడు; చురుకైనవాడు కాదుగాని, ఋజువర్తనానికి పేరు పొందినవాడు.) ఇక, జర్మనీ తరఫున ఈ రాయబారాలలో పాల్గొన్నవాడు, జర్మన్ విదేశాంగమంత్రి కర్టిస్ (ఇతడు డాక్టర్ బ్రూనింగ్ మంత్రి వర్గానికి చెందినవాడు). వీరు ఉభయులు తమతమ దేశాలకు గల సాధకబాధకాలను అన్నింటిని చర్చించిన మీదట, 1931 మార్చినెలలో ఒక ఒడంబడికకు రాగలిగారు. కాని, ఫ్రాన్సు దీనిని అమలులోనికి రానివ్వలేదు.

సుంకాల విషయంలో ఆస్ట్రియా, జర్మనీల మధ్య ముందు ఐక్యత ఏర్పడితే, ఇది కాలక్రమాన సంపూర్ణమైన

ఐక్యతగా పరిణమిస్తుందని ఫ్రాన్సు భయం. ఈ భయం కొంత వరకు సకారణమైందే! అయితే, ఇంకొక విషయాన్నికూడా ఆలోచించాలి. ఆస్ట్రియా, జర్మనీలు రెండూకూడా ఆర్థికంగా అనేక కష్టాల్ని పడుతున్నవి. విడివిడిగా వున్నంతకాలం ఆ రెండిటిలో దేనిస్థితికూడా చక్కబడదు. ఇది అసంతృప్తికీ, అశాంతికీ దారి తీస్తుంది. ఇక, వాటిని ఏకం కానిస్తే పరస్పర సహాయ సహకారాలవల్ల రెండూకూడా సుఖపడతవి. సుఖం వల్ల సంతృప్తి, సంతృప్తి కారణంగా శాంతి ఏర్పడుతుంది. ఈ పరిస్థితిలో మొదటి మార్గమా, రెండవమార్గమా— ఏది అనుసరణీయం? జ్ఞానంకలవాడు ఎవరైనాసరే ఈ ప్రశ్నకు ఒకటే జవాబు చెబుతాడు—"మొదటి మార్గమే" అంటూ. అయితే, ఫ్రాన్సుమాత్రం రెండవమార్గాన్ని అనుసరించింది. దీని ఫలితం—అది ఏ ఐక్యతను ప్రతిఘటించ యత్నించిందో అది ఈనాడు జరగడమే కాకుండా— శాంతినికోరే సోషల్ డిమోక్రాట్ డాక్టర్ బ్రూనింగ్ ఆధ్వర్యం కింద కాకుండా— యుద్ధ దేవతను ఉపాసించే నాజీ లీడర్ హిట్లర్ హయాంలో ఈపని జరగడం!

ఆస్ట్రియా, జర్మనీల మధ్య సుంకాల విషయంలో ఐక్యత కూడదని అనడానికి ఫ్రాన్సు చెప్పిన కారణం,— అది 1914_18 నాటి యుద్ధానంతరం జరిగిన సంధికి విరుద్ధమని. నిజంగా ఈ ఐక్యత ఆ సంధికి విరుద్ధమా, కాదా అనే విషయం హేగ్ కోర్టుకు విచారణకు వెళ్ళింది. ఆకోర్టు జడ్జీలు న్యాయ

విచారణకంటె, రాజకీయోద్దేశాలకే అధిక ప్రాధాన్యాన్ని ఇచ్చి ఒకవోటు మెజారిటీతో "విరుద్ధం" అనే తీర్పు ఇచ్చారు. అసలు ఈ తీర్పు తతంగం కూడా పూర్తిగా అనవసరం. ఎందుచేతనంటే,— హేగ్ కోర్టు తీర్పు తనకు అనుకూలంగా వున్నా, ప్రతికూలంగా వున్నా, తానుమాత్రం ఆస్ట్రియా, జర్మనీల మధ్య ఏవిధమైన ఐక్యతను ఏర్పడనివ్వనని ఫ్రాన్సు ముందుగానే ప్రకటించింది!

తన పట్టుదల సాగించుకోడానికి ఫ్రాన్సు ఒక ఎత్తు వేసింది. అది ఏమంటే,—ఆస్ట్రియన్ బ్యాంకుల నుంచి తనకు రావలసిన బాకీ మొత్తాలను ఒక్కసారిగా రాబట్టడం. దీని ఫలితాలు ఇవి: క్రెడిట్ స్టాల్ట్—ఇది ఆస్ట్రియన్ బ్యాంక్—మధ్యయూరప్ అంతటికీ ప్రధానమైన ఆర్థికసంస్థ ఇదే—ముందుగా దివాలా తియ్యడం; తర్వాత జర్మన్ బ్యాంకింగ్‌లో విషమపరిస్థితులు ఏర్పడ్డం; యుద్ధ ఋణాల వాయిదాల తీర్మానాన్ని తాత్కాలికంగా నిలుపు చెయ్యవలసి రావడం; మారకపు రేట్లు పడిపోవడం; యూరప్ అంతటిలోనూ బ్యాంకులు బోర్డుల్ని తిప్పివెయ్యడం; గ్రేట్ బ్రిటన్ గోల్డ్‌స్టాండర్డ్‌ను రద్దు చెయ్యడం...

ఆస్ట్రియా, జర్మనీల మధ్య సుంకాల విషయమై ఐక్యత ఏర్పడరాదని ఫ్రాన్సు వేసిన ఎత్తుకు కలిగిన విపరీత ఫలితాలు ఇవి! ఇంతగొడవ చేసినమీదట ఎప్పుడూ, ఏ రూపంలోనూ జర్మనీతో ఐక్యతను అభిలషించ కూడదనే షరతుమీద

ఆస్ట్రియాకు నానాజాతిసమితి ద్వారా ఫ్రాన్సు తిరిగి కొంత అప్పు పెట్టింది.

స్వార్థం నీచమైనదనీ, అంధప్రాయ మైనదనీ అనడానికి ఇంతకంటె నిదర్శనం కావాలా?

## 6

1931 వరకు ఆస్ట్రియన్ వ్యవహారాలు ఒక ధోరణిలో నడిచాయి; ఆ తర్వాత ఇంకొక ధోరణి పట్టాయి. మొదటి ధోరణికీ తర్వాతదానికీ ప్రధానమైన భేదం ఏమంటే,—మొదటిలో ఆస్ట్రియా జర్మనీతో ఎంతగా ఐక్యతను అభిలషించిందో, తర్వాత అంతగా ఆ ఐక్యతనే ప్రతిఘటించడం. ఈ పరిపూర్ణమైన మార్పుకు గల కారణాలు రెండు. వీటిలో మొదటిది—డాక్టర్ డోల్ఫుస్ ఆస్ట్రియాకు ఛాన్సలర్ కావడం. పోతే, రెండోది—హెర్ హిట్లర్ జర్మనీకి డిక్టేటర్ కావడం.

ఆస్ట్రియాలో ఒక 'కష్టమ్సు ఇన్‌స్పెక్టర్' మూడో భార్య కడుపున పుట్టిన హిట్లర్—చదువు సంధ్యల్ని ఎరగని హిట్లర్—ఇళ్ళకు రంగులు వేసి పొట్ట పోసుకున్న హిట్లర్—1914-18 నాటి యుద్ధంలో ఉత్తరాల బంట్రోతుగా పని చేసిన హిట్లర్ — 1919 లో సి. ఐ. డి. గా రాజకీయాలలోకి దిగిన హిట్లర్ — చివరికి జర్మనీకి నాథుడు ఎలా కాగలిగాడో ప్రస్తుతానికి అనవసరం, కాని, డాక్టర్ డోల్ఫుస్

ఆస్ట్రియాకు ఛాన్సలర్ కాగలిగిన విధాన్ని మాత్రం తప్పక తెలుసుకోవాలి.

డాక్టర్ డోల్ఫస్—అన్నట్టు ఇతడి సంగతి సరిగా తెలియాలంటే, ఆస్ట్రియన్ రాజకీయాల్ని ఒకసారి సింహావలోకనం చెయ్యాలి.

## 7

రాజధానీ నగరమైన వియన్నాకూ, తక్కిన దేశానికీ సంఘర్షణ— ఇదే ఆస్ట్రియన్ రాజకీయాల కీలకం.

తక్కిన దేశం అంతటిలోనూ రెండువంతుల జనాభా వుంటే, ఒక్క వియన్నాలో ఒకవంతు ఉండడం; తక్కిన దేశం అంతా ఎనిమిది రాష్ట్రాలకింద వుంటే, వియన్నా తనంతట తాను ప్రత్యేకంగా ఒక రాష్ట్రం కావడం; తక్కిన దేశం సారవిహీనమైన భూముల్ని సాగుచేస్తూ, సగం ఆకలితో వుంటూ వుంటే, పరిశ్రమల ఆధారంతో వియన్నా పచ్చ పచ్చగా వుండడం ;— ఈ విభేదాలవల్ల ఆ రెంటికి మధ్య సహజంగానే సంఘర్షణ ఏర్పడింది.

ఇలా సహజంగా ఏర్పడ్డ ఈ సంఘర్షణ ఇతర కారణాల వల్ల మరింత బలీయమైంది. ఈ ఇతర కారణాలలో ముఖ్యమైంది ఏమంటే,—వియన్నా ఒక రాజకీయ పక్షానికి కేంద్రమైతే,

తక్కిన దేశం ఇందుకు సరిగా వ్యతిరేకమైన ఇంకొక రాజకీయ కక్షకు కార్యరంగం కావడం.

వియన్నాను కేంద్రంగా తీసుకున్న రాజకీయ పక్షం పేరు,— సోషల్ డిమోక్రాటిక్ పార్టీ. దీని దృక్పథం చాలా విశాలమైంది. ప్రజా సముదాయానికి—ముఖ్యంగా కార్మికులకు— హితాన్ని కూర్చడమే దీని ఆశయం. జీవితంలోని ప్రతి అంశం లోనూ, ఇది అభివృద్ధిని ఆశిస్తుంది.

పోతే, తక్కిన దేశంలో స్థావరం కుదుర్చుకున్న పక్షం పేరు,— కాథొలిక్ క్రిష్టియన్ సోషల్ పార్టీ. దీని ఆశయా ల్ని వేరుగా వర్ణించడంకంటె, సోషల్ డిమోక్రాటిక్ పార్టీకి ప్రతివిషయంలోనూ ఇది భిన్నంగా వెడుతుందని చెబితే క్లుప్తంగా సరిపోతుంది!

సోషల్ డిమోక్రాటిక్ పార్టీ ఆధ్వర్యంకింద వియన్నా ప్రపంచం అంతటికీ ఆదర్శప్రాయమైన నగరమైంది. వియన్నా పురపాలక సంఘాన్ని స్వాధీనపరుచుకుని, తద్వారా అది కార్మికులకు ఎన్నో సౌకర్యాలను చేసింది. పని దొరకక అల్లా డుతూవున్న కూలీలకు పింఛనులు, ఇన్సూరెన్సు మొదలైన సాధనాలద్వారా సహాయాన్ని చెయ్యడం, కడుపుతోవున్న ఆడకూలీలకు సీమంతానికి ముందు కొన్నిరోజులు— ఆ తర్వాత కొన్ని రోజులు సెలవు మంజూరు చెయ్యడం, వారికి మందు మాకులు కావలసివస్తే వాటిని ఉచితంగా సప్లయి చెయ్యడం

కూలీల పిల్లలకు జీతం నాతెం లేకుండా చదువు చెప్పించడం, వాళ్ళు ఆడుకోడానికి ఆటస్థలాల్ని ఏర్పాటు చెయ్యడం,— సోషల్ డిమోక్రాటిక్ పార్టీ కార్మికులకు చేసిన సౌకర్యాలలో ఇవి కొన్ని. చిన్న చిన్న ఈసౌకర్యాలను చెయ్యడంతో పాటు, కార్మికులకోసం అది ఒక పెద్ద కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వహించింది కూడా! ఆ కార్యక్రమం ఏమంటే,— గాలికీ వెలుతురుకీ నోచుకోని కూలీల పాడు కొంపల్ని పడగొట్టించి, ఆస్థలంలోనే వారికోసం దివ్యభవనాలను కట్టించడం. ఇక్కడ "దివ్యభవనాలు" అనేమాట, అలంకారంకోసం అన్నది కాదు. వియన్నా కార్మిక భవనాలు నిజంగా దివ్యభవనాలే! వాటిని నిర్మించింది వేల ఖర్చుతో కాదు,—లక్షల వ్యయంతో. వాటిని నిర్మించినవారు సామాన్యులు కాదు,— ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఇంజనీయర్లు. అందచందాలలో నేమి, సౌకర్యాలలో నేమి, రాజప్రాసాదాలుకూడా ఈ భవనాలకు ఈడు రావనే చెప్పాలి! ఇంత దేనికి? ఈ భవనాల్ని నిర్మించిన తర్వాత వియన్నాకు "మోడల్ సిటీ" అనే ఖ్యాతివచ్చింది!

కార్మికులకు ఇన్ని సౌకర్యాలను కల్పించినప్పటికీ, వియన్నాను ఆదర్శప్రాయమైన నగరంగా చేసినప్పటికీ, ఇందుకోసం సోషల్ డిమోక్రాటిక్ పార్టీవారు—ఒక స్వల్పమైన మొత్తాన్ని మినహాయించి – ఋణాన్ని చెయ్యనూ లేదు; ఇతరమైన వాటికి వినియోగపడవలసిన రాబడీని దీనికిగాను ఖర్చుపెట్టనూ లేదు. ప్రభుత్వోద్యోగుల హెచ్చు జీతాలను విరగగొయ్యడం,

గుర్రపు పందెములమీద నూటికి 33⅓ వంతుల పన్ను వెయ్య డం, ఇంటిపనులకు నౌకర్లు చాకర్లు కావలసిన వారివద్దనుంచి (వారు పెట్టుకున్న మనుష్యుల అంకెను బట్టి) వీలైనంత అధి కంగా పన్ను రాబట్టడం,— తమ కార్యక్రమ నిర్వహణానికి కావలసిన ధనాన్ని చేకూర్చడంలో వారు అవలంబించిన మార్గాలు ఇవే!

సోషలిస్టుల హయాంకింద వియన్నా ఈవిధంగా అభి వృద్ధి పొందడమూ, సౌఖ్యవంతంగా వుండడమూ చూస్తే, తక్కిన దేశానికి కడుపుమంట పుట్టింది. ఈ కడుపుమంట కార ణంగా మితవాదానికీ, మాఢ్యానికీ నిలయమైన కాథొలిక్ క్రిష్టియన్ సోషల్ పార్టీకి అక్కడ మంచిబలం ఏర్పడింది. ఈపార్టీకి దేశం మొత్తంమీద మూడింట రెండు వంతుల మెజారిటీ వుంది. ఈ మెజారిటీతో అది ఆస్ట్రియన్ ఫెడరల్ రాజ్యాంగ విధా నాన్ని రూపుమాపి, పూర్వపు హాప్సుబర్గ్ రాజులకు తిరిగి పట్టంకట్టి, వియన్నా సోషలిస్టులను హత మార్చాలని ఎంతగానో అభిలషించింది. కాని, వియన్నా ఆమోదం లేనిదే రాజ్యాంగ విధానాన్ని మార్చడానికి వీలులేదు గనక, ఈఅభిలాష తీరలేదు.

చట్టరీత్యా వియన్నా సోషలిస్టులమీద పగ సాధించ డానికి వీలులేకపోవడాన్ని చూచి, దౌర్జన్యం చెయ్యడానికి కాథొ లిక్ క్రిష్టియన్ పార్టీవారు ఒక ప్రయివేటు సైన్యం ఏర్పాటుకు

తోడ్పడ్డారు. ఈ సైన్యం పేరు హైమ్‌వీర్. స్టార్ హెన్‌బర్గ్, మేజర్ ఫే— వీ రుభయులు ఈ సైన్యానికి నాయకులు.

తమ ప్రతికక్షులు దౌర్జన్యం చెయ్యడంకోసం ఒక సైన్యాన్ని కూర్చుకుంటే, వియన్నా సోషలిస్టులు ఆత్మరక్షణ కోసం ఇంకొక సైన్యాన్ని కూర్చుకోవడం తప్పనిసరి అయింది. సోషలిస్టులు కూర్చుకున్న ఈ సైన్యం పేరు,— షుట్స్‌బండ్. షుట్స్‌బండ్ అంటే,— "రక్షణదళం" అని అర్థం. దీన్నిబట్టే ఈ సైన్యప్రయోజనం విదితమౌతున్నది!

ఏదైనా ఒక దేశంలో తీవ్రమైన అభిప్రాయ భేదాలు గలరెండు రాజకీయపక్షాలు వుంటేనే, వాటిమధ్య బహిరంగ సంఘర్షణ తప్పదు. ఇక, ఆ రెండు పక్షాలకును సమర్థించడానికి విడివిడిగా సైన్యాలుకూడా వుంటే, ఇక చెప్పాలా? ఆస్ట్రియాలో సోషల్ డిమోక్రాటిక్ పార్టీ సైన్యానికీ, కాథోలిక్ క్రిస్టియన్ పార్టీ సైన్యానికీ అనేక పర్యాయాలు చిన్నచిన్న యుద్ధాలు జరిగాయి! క్రమంగా ఈ చిన్నచిన్న యుద్ధాలే పెద్దవై, 1934 లో అంతర్యుద్ధానికి ఆస్ట్రియా కేంద్రమైనది. ఈ అంతర్యుద్ధాన్ని గురించి చెప్పాలంటే, తిరిగి డాక్టర్ డోల్ఫస్ సంగతి ఎత్తుకోవాలి.

## 8

డాక్టర్ డోల్ఫస్ పూర్తిపేరు,— డాక్టర్ ఎన్‌జెల్‌బర్ట్ డోల్ఫస్. అతడి జననం లోయర్ ఆస్ట్రియాలోని టెక్సింగ్

అనే గ్రామంలో 1892 అక్టోబరు 4 వ తేదీనాడు. అతి సామాన్య స్థితిపరులు — అతడి తల్లిదండ్రులు. అతడితో బుట్టిన వాళ్ళు ఈ నాటికికూడా స్వగ్రామంలో వ్యవసాయం చేసు కుంటూ కాలం గడుపుతున్నారు.

కుటుంబం అంతటిలోనూ పెద్దచదువు చదువుకున్న వాడు ఎంజెల్‌బర్టు ఒక్కడే. ముందు తమ గ్రామం సమీపంలోని బడిలో చదువుకుని, ఆ తర్వాత వియన్నా కళాపరిషత్తులో చేరి, న్యాయశాస్త్రం (లా) లో డాక్టరు పట్టాన్ని సంపాయించాడు.

1914 లో యుద్ధం ప్రారంభం కాగానే అతడు ప్రయి వేటుగా సైన్యంలో చేరి—— అతడు చేరింది 'కెయిజర్ చుట్ జెన్' అనే విఖ్యాత దళంలో—— మూడు సంవత్సరాలపాటు యుద్ధంలో పాల్గొని, లెఫ్టినెంట్ హోదాను గడించుకున్నాడు. ఆస్ట్రియన్ ఇంపీరియల్ ఆర్మీలో — అంటే, హాప్స్‌బర్గు రాజుల సైన్యంలో — మామూలు సైనికు డొకడు లెఫ్టినెంట్ హోదాను గడించుకోవడం సామాన్య విషయం కాదు.

ముందు విద్యార్థి దశలోనూ, తర్వాత సైన్యంలోనూ చివరికి రాజకీయరంగంలోనూ — ఒక్క మాటలో — జీవితంలో డాక్టరు డోల్ఫస్ చాలా 'పాపులరు' గా (పలుకుబడి గల వాడుగా) వుండేవాడు. అతడి 'పాపులారిటీ' (పలుకుబడి) రహస్యం: అతడి కురచదనమే! అతడి యెత్తు నాలుగు అడు గుల పదకొండు అంగుళాలు మాత్రం. జాన్ గన్ థర్ చలో

క్తిగా అన్నట్టు— ఆరడుగులవాడిమీద ఆగ్రహం తెచ్చుకో వచ్చునుగాని, అయిదడుగులైనాలేని ప్రధానామాత్యుణ్ణి ద్వేషించడం సాధ్యమా!

అతడి కురచదనాన్ని గురించి ప్రచారంలో వున్న హాస్య కథలు కుప్పలూ, తిప్పలూ! అతన్ని హత్య చెయ్యడానికి జరిగిన ప్రయత్నాన్ని ఒకనాడు పోలీసువారు కనిపెట్టారట. ఆప్రయత్నం ఏమంటే,— అతడి పడకగదిలో ఎలుకబోనును పెట్టడం! పోస్టు బిళ్ళలమీద అతడి మొహర్ వెయ్యాలను కున్నారట,— అయితే ఈ మొహర్ మామూలుగా శిరో భాగం (బస్ట్) చిత్రం మాత్రమే కాదు,— యథాతథంగా అతని రూపం అంతా (లైఫ్ సైజ్)! ఆస్ట్రియన్ వైజ్ఞా నికు డొకడు పరమాణువును విభాగించి, నోబుల్ బహుమా నాన్ని పొందాడట,— అతడికి ఇంతటి గౌరవాన్ని కూర్చిన పర మాణువు— డోల్ఫస్! రాత్రిపూట సరిగా నిద్రపట్టకపోతే, అతడు గదిలో పచారు చేసేవాడట,— అది కాకపోతే, కూజా లోని నీళ్ళపైన పేరుకున్న మంచుమీద స్కేటింగ్ చేసేవాడట! ముసోలినీని సందర్శించడానికి వెళ్ళినప్పుడు అతడు రైలులో వెళ్ళలేదట,— "ఎయిర్ మెయిల్" టపాలో అతన్ని పంపించా రట! ఆస్ట్రియన్ సర్వసేనాపతి ఒకనాడు సైన్యాల్ని "రివ్యూ" చేస్తూవుండగా, వాటి శిరోభాగాన ఒక తాబేలు కనబడిందట,— "తాబేలు ఇక్కడికి ఎలా వచ్చింది చెప్మా" అని అతడు పరీక్షగా చూస్తే, అది అసలు తాబేలు కాదనీ, "హెల్మెట్"

(శిరోవేష్టం) పెట్టుకున్న డాక్టరు డోల్ఫస్ అనీ తేలిందట! ఒకరాత్రి నాజీలు కొందరు అతణ్ణి హత్య చెయ్యాలని గదిలో ప్రవేశించారట,—అప్పు డతడు మారు గొంతుతో "మా నాన్న ఇంట్లో లేడు" అంటూ దుప్పటి గట్టిగా ముసుగు పెట్టుకున్నాడట. ఇలా అన్నది నిజంగా డోల్ఫస్ కొడుకే అని మోసపోయి, ఆ నాజీలు వెళ్ళిపోయారట! ఇలాగే ఇం కెన్నో కథలు—వీటికి అంతులేదు! తెంపులేదు!

పొట్టితనానికి తోడు పల్లెటూరి రైతుతరహాకూడా డోల్ఫస్ పలుకుబడికి కొంత కారణమైందట. ఎంత చదువు కున్నా, ఎంతటి ఉన్నత పదవుల్ని ఆక్రమించినా, ఇం కెంత లోకానుభవాన్ని గడించినా, "పల్లెటూరి రైతుతనాన్ని" మాత్రం అతడు కోల్పోలేదట. అంచేతనే ఎవరైనా ప్రశంసా వాక్యాలు పలికితే "ఆఁ! పోదురూ!" అని పదహారేళ్ళ పిల్లలా సిగ్గుపడుతూ అనేవాడట: అతని ఉపన్యాసాలలోనూ, కార్యకలాపాలలోనూ ఇలాంటి ప్రవృత్తే కనబడేదట కూడా!

ఈ విధంగా "పల్లెటూరి రైతుతనం" అతణ్ణి అమా యకుడుగానూ, అనురాగ యోగ్యుడుగానూ చేసినప్పటికీ, ఇదే అతడి సంకుచిత బుద్ధికీ, అతడి మతమౌఢ్యానికీ, అతడి అదూర దృష్టికీ కారణమైంది కూడా!

కాథొలిక్ క్రిష్టియన్ సోషల్ పార్టీ సభ్యుడుగా డోల్ఫస్ రాజకీయాలలో ప్రవేశించాడు. ప్రారంభంలో అతడు

రైతు సమస్యలంటే అభిమానాన్ని చూపించి, లోయరు ఆస్ట్రియాలోని రైతుల్ని ఒక సంఘంగా ఏర్పరచి, ఆ సంఘం తోడ్పాటుతో ఆస్ట్రియన్ ఫెడరల్ పార్లమెంటులో సభ్యు డయ్యాడు. డోల్ఫస్ పార్లమెంటరీ సభ్యత్వాన్ని సంపాయించుకున్న కొత్తలోనే, ఫెడరల్ రైల్వే కౌన్సిల్ వారికి వ్యావసాయిక సమస్యలలో ప్రత్యేక పరిజ్ఞానం గల ప్రవీణుడు కావలసివచ్చాడు. ముందు ఈ రీతిగా ఫెడరల్ రైల్వేకౌన్సిల్‌లో చేరి, తర్వాత 1930 అక్టోబరులో అతడు ఆసంస్థకు అధ్యక్షు డయ్యాడు. ఆపైన 1931 మార్చిలో అతడు — అప్పటి క్రిస్టియన్ సోషల్ ప్రభుత్వ వర్గంలో—వ్యవసాయిక మంత్రిపదవిని పొందాడు.

డోల్ఫస్ వ్యవసాయ శాఖా మంత్రి అయిన సంవత్సరానికి—అసాధ్యాలైన కొన్ని క్లిష్ట సమస్యలు ఎదుర్కొనడం వల్ల—డాక్టరు బురేష్ నాయకత్వం కింద అప్పటిలో అధికారంలో వున్న క్రిస్టియన్ సోషల్ మంత్రివర్గం రాజీనామా పెట్టవలసివచ్చింది. అప్పుడు డాక్టరు డోల్ఫస్‌ను నూతన మంత్రివర్గాన్ని ఏర్పాటు చెయ్యవలసిందిగా కోరారు. పార్లమెంటులో ఒక్క వోటుమాత్రమే మెజారిటీ వుండడంవల్ల—పార్టీలోని తక్కిన సభ్యులైతే ఈ ఘనతర బాధ్యతను వహించడానికి సమ్మతించేవారు కాదు—అయితే డోల్ఫస్ మాత్రం ఏమీ జంకక — కర్తవ్యాన్ని చూపవలసిందిగా రాత్రి అంతా కూడా భగవంతుణ్ణే ప్రార్థించి— ఉదయానికి (1932 మే 20) కొత్త మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసి, తాను ప్రధాని

అయ్యాడు. ఒక్క వోటు మెజారిటీతో డోల్ఫస్ ఎన్నో రోజులపాటు అధికారంలో వుండడని అనుకున్నారు గాని, రెండేళ్ళ తర్వాత నాజీల చేతిలో హత్య అయ్యేవరకూ అతడు తన పదవిని సమర్థించుకో గలిగాడు.

మొండిధైర్యం, మొండిపట్టుదల—ఈ గుణాలూ; వీటితోపాటు "డ్రిమేటిక్" పరిస్థితులు ఏర్పడితే, వాటిని స్వప్రయోజన సిద్ధికి వినియోగించుకోగల ప్రతిభ;—డోల్ఫస్ విజయానికి కారణాలు ఇవే! పై వాక్యానికి నిదర్శనంగా రెండు సంఘటనల్ని చెప్పవచ్చు. వాటిలో మొదటిది ఇది: డోల్ఫస్ ఛాన్సలరు పదవికి వచ్చిన కొత్తలో "లూసాన్ లోన్" అనే ఒక ఋణాన్ని "రాటిఫై" చెయ్యవలసిన (ఆమోదించవలసిన) అవసరం కలిగింది. ఈ ఋణాన్ని "రాటిఫై" చేస్తే, ఆస్ట్రియాకు 30 కోట్ల స్కిల్లింగ్స్—ఇవి ఆస్ట్రియన్ నాణెములు—ధనసహాయం లభిస్తుంది. అయితే సోషలిస్టులకు గాని, నాజీపక్షంవారికిగాని దీన్ని "రాటిఫై" చెయ్యడం ఇష్టం లేదు. "విదేశాలనుంచి ఋణాన్ని పుచ్చుకుంటూవుంటే, మన వ్యవహారాలపైన విదేశ ప్రభుత్వాలకు అనర్థదాయకమైన అధికారం ఏర్పడుతుంది" అని సోషలిస్టు అభ్యంతరం. "బ్రిటన్, ఫ్రాన్సు, జెకోస్లావాకియా మొదలైన దేశాలు అప్పు పెడుతూవుంటే, వాటికి ఆస్ట్రియాలో పలుకుబడి కలగడమూ, అందు మూలంగా ఆస్ట్రియా—జర్మనీల కలయిక దూరం కావడమూ, జరుగుతుం"దని నాజీల అనుమానం. ఈ రీతిగా ఈ

ఉభయపక్షాలవారు ప్రతికూల్యాన్ని వహిస్తే, ఇక డాక్టరు డోల్ఫస్‌కు పార్లమెంటులో వున్న మెజారిటీ ఒక్క వోటు మాత్రమే! దానితోనే లూసాన్ ఋణాన్ని 'రాటిఫై' చేయించాలని, అతడు ఒకనాటికి పార్లమెంటు సమావేశాన్ని నిశ్చయించాడు. తీరా ఇలా నిశ్చయించిన తర్వాత — తలవని తలంపుగా — ఆనాటి ఉదయం డాక్టరు సైపిల్ చనిపోయాడు. దానితో డాక్టరు డోల్ఫస్ కున్న ఒక్క వోటు మెజారిటీ గంగలో కలిసిపోయింది. ఇలా జరిగిందని అతడు హతాశు డయ్యాడా? లేదు. అప్పటికప్పుడు—గతించిన సభ్యుని స్థానంలో— ఒక కొత్త సభ్యుని నియమించాడు. ఇంతటితో కూడా సంతృప్తి పడక, తన పార్టీ సభ్యులనందరిని—వారిలో కొందరు అనారోగ్యంగా వున్నప్పటికీ—సమావేశానికి యీడ్చుకు వచ్చాడు. ఇక్కడ 'ఈడ్చుకు వచ్చాడు' అనే ప్రయోగంలో లేశమైనా అత్యుక్తి లేదు. ఎంచేత నంటే,—జబ్బుగా వున్న ఒక సభ్యుణ్ణి ముగ్గురు చేతులమీద ఎత్తుకు వచ్చారు; గాయపడి వున్న ఇంకొక సభ్యుణ్ణి—కట్లతో సహా—ఆసుపత్రినుంచి మోసుకువచ్చారు. ఇలా చేసి డోల్ఫస్ తనదే గెలుపు అనిపించుకున్నాడు—ఒక్క వోటుతో!

పోతే, రెండో సంఘటనకూడా ఇలాంటిదే! ప్రతి పక్షానికి చెందిన మాజీ ఛాన్సలరు డాక్టరు షోబరు రాత్రివూట చనిపోతే, ఆ ఉదయానికి పార్లమెంటు సమావేశాన్ని జరిపి,

తిరిగి ఒక్క వోటుతో డాక్టరు డోల్ఫస్ ఇంకొక తీర్మానాన్ని 'ప్యాస్' చేయించాడు!

ఈ విధంగా పార్లమెంటరీ తతంగాన్ని కొంతకాలంపాటు జరిపిన తర్వాత, 1933 మార్చి 4 వ తేదీనాడు డాక్టరు డోల్ఫస్ అసలు ఆ పార్లమెంటునే రద్దు చేశాడు. అంటే,—ఏ డిక్రీనో, ఆర్డినెన్సునో ప్రకటించి రద్దుచెయ్యడం కాదు. కాని — తన మీద నెపం లేకుండా — అతి "డ్రమేటిక్" గా అంతపనీ చేశాడు! జీతాలు బకాయి పడిపోయా యని సమ్మెచేసిన రైల్వేకార్మికుల పట్ల ఔదార్యంగా ప్రవర్తించాలని ఆనాటి పార్లమెంటు సమావేశంలో ఒక తీర్మానం చర్చకు వచ్చింది. అప్పుడు — సరిగా వోటింగ్ వేళకు — ఒక సోషలిస్టుడిప్యూటీ (సభ్యుడు) ఏదో పనిమీద వెళ్ళడమూ, అతడి బదులు అతడి సోదరసభ్యు డొకడు వోటు చెయ్యడమూ జరిగింది. ఈవోటింగ్ సవ్యంగా జరిగితే, చిక్కే లేకపోయేది. కాని, అలా జరగలేదు,— బయటికి వెళ్ళిన సభ్యుడి తరఫున వోటు చేస్తూ, అతడి పేరు వ్రాయడానికి బదులు, పొరపాటున తన పేరునే వ్రాసి వోటు చేశాడు. ఇలా జరిగినతర్వాత ఆనాటి వోటు ఫలితం: ప్రభుత్వానికి అనుకూలం 80; దానికి ప్రతికూలం 81. ఈ పరిస్థితిలో "ప్రభుత్వం ఓడిపోయింది" అని నిస్సంకోచంగా ప్రకటిస్తే ఏమి జరిగేదోగాని, ధర్మబుద్ధికొద్దీ అలా ప్రకటించలేక, పార్లమెంటరీ స్పీకరు డాక్టరు రెన్నరు— ఇతడు సోషలిస్టుపక్షం వాడు— "వోటింగ్‌లో అక్రమం జరిగినట్టున్నది" అని

నిజాన్ని బయటపెట్టాడు. అందుమీదట సభలో పెద్ద గల్లంతు బయల్దేరింది. ఈ గల్లంతును చూచి— కేవలం అనాలోచితం గానూ, అదూరదృష్టితోనూ— స్పీకరు రెన్నరు తన పదవికి అక్కడికక్కడనే రాజీనామా పెట్టి, అధ్యక్షపీఠంనుంచి లేచి పోయాడు. అతడి తర్వాత డిప్యూటీ స్పీకర్లు ఇద్దరూకూడా తమ పదవులకు రాజీనామా ఇచ్చివేశారు. దానితో ఆనాటి సభ అంతమైంది.

ఈ గొడవను చూడగా, తనకు చక్కటి అవకాశ మొకటి చేచిక్కినట్టు డాక్టరు డోల్ఫస్‌కు తోచింది. అంతే— వెంటనే అతడు దాన్ని వినియోగించుకున్నాడు. ఆస్ట్రియన్ రాజ్యాంగ విధానం ప్రకారం పార్లమెంటరీ సమావేశాన్ని జరప గల అధికారం స్పీకరుకూ డిప్యూటీ స్పీకర్లకు మాత్రమే వుంది. ఈ ముగ్గురు రాజీనామా ఇచ్చివేశారు గనక – వీరి స్థానంలో కొత్తవారిని నియమించకపోతే—పార్లమెంటు సమావేశం జరగ డానికి వీలులేదు. ఈ సందు చూచుకుని, డాక్టరు డోల్ఫస్— తాను తప్ప మరెవ్వరు అప్పటిలో ప్రభుత్వాన్ని సాగించగల స్థితిలో లేరనే ధీమాకొద్దీ—తన ఛాన్సలరు పదవికి రాజీనామా పెట్టాడు. అనుకున్నట్టుగానే ఈ ఎత్తు పారింది; ప్రత్యేకాధి కారాలతో డాక్టరు డోల్ఫస్‌కు తిరిగి ఛాన్సలరు పదవి లభిం చింది. కొత్తగా ఇలా ఛాన్సలర్ పదవికి వచ్చిన మర్నాడు— అంటే 1933 మార్చి 9వ తేదీనాడు—అతడు ఎన్నో కొత్త డిక్రీలనూ, ఆర్డినెన్సులనూ ప్రకటించాడు. వీటిని చూడగానే

ఆస్ట్రియలో పార్లమెంటరీ విధానం బుగ్గి కలిసిపోయిందనీ, డాక్టర్ డోల్ఫస్ డిక్టేటర్ అయ్యాడనీ తెలుసుకుని ఆస్ట్రియన్ ప్రజలు తెల్లబోయారు.

# 9

బుద్ధి కుశలతవల్ల కార్యసిద్ధి కలుగుతుంది. ఇందుకు సందేహం లేదు. అయితే అన్ని వేళలలోనూ ఇది కార్యకారి కాదు; కాలేదు. ఎందుచేతనంటే,—విశేష బుద్ధికుశలత గల వ్యక్తికూడా ఒక్కొక్కప్పుడు తనకుమించిన శక్తుల సుడిగుండంలో చిక్కుపడి, కొట్టుకు పోతాడు. డాక్టర్ డోల్ఫస్ జీవితం ఇందుకు చక్కని తార్కాణం: అతడు కేవల తన కుశాగ్ర బుద్ధివల్ల డిక్టేటర్ కాగలిగాడు. అయితే, ఆ పదవిని ఎంతో కాలం అనుభవించక ముందే రెండు భీషణ శక్తుల నడుమ పడి నలిగిపోయాడు. ఈ శక్తులలో మొదటిది నాజీజం, రెండవది ఫేసిజం.

జర్మనీ, ఇటలీ: ఇవి రెండూ శక్తిమంతములైన రాజ్యాలు. హిట్లర్, ముసోలినీ: వీరిద్దరూ దురాశాపరులైన నిరంకుశ ప్రభువులు. నాజీజం, ఫేసిజం: ఇవి రెండూ దోపిడిని ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్న దౌర్జన్యయుత రాజకీయ సిద్ధాంతాలు. ఈ రెండు రాజ్యాలమధ్య, ఈ యిద్దరు నిరంకుశ ప్రభువుల మధ్య, ఈ రెండు రాజకీయ సిద్ధాంతాల

మధ్య, ఆస్ట్రియా అంతటి చిన్న దేశానికి డిక్టేటర్ అయిన డాక్టర్ డోల్ఫస్—అతడెంతటి తీక్ష్ణబుద్ధిగలవాడైనా—నిర పాయంగా జీవించగలడా? జీవించలేదు—ముమ్మాటికీ! ఇదే విషయాన్ని తర్వాతి సంఘటనలు రూఢి చేశాయి!

హిట్లర్ జర్మనీకి డిక్టేటర్ కాకపూర్వమే ఆస్ట్రియాలో నాజీపార్టీ వుండేది. అయితే, అప్పటిలో దానికి ఏమీబలం వుండేది కాదు. తక్కిన ఎన్నో చిల్లర పార్టీలతోపాటు అది కూడా ఒక పార్టీ. అంతే! మొదటిలో ఇలా వున్న ఆస్ట్రియన్ నాజీపార్టీకి హిట్లరు జర్మన్ ప్రభుత్వాన్ని వశపరుచుకున్న వెంటనే మంచిబలం ఏర్పడింది. స్వతంత్రంగా జీవించడం దుస్సహంగా వుంది కనక, జాతిలోనూ, భాషలోనూ, కొంత వరకు విజ్ఞానంలోనూ ఐక్యత వున్న జర్మనీతో కలిసి పోదామనే పాతకోర్కె వుండనే వుంది. ఇందుకు హిట్లర్ ఆస్ట్రియావాడుగదా అనే భావంకూడా తోడైంది. ఇందువల్ల ఆస్ట్రియా తినంతట తానుగా జర్మనీలో కలిసి పోయేదే! అయితే, రాజ్యాధికారానికి వచ్చినవెంటనే హిట్లరు చేసిన దౌష్ట్యాలు—ముఖ్యంగా యూదుజాతివారిని అతడు పెట్టిన హింసలు—ఆస్ట్రియా మనస్సును విరిచి వేశాయి. పైగా, హిట్లరు తోడ్పాటుతో ఆస్ట్రియన్ నాజీలు దౌర్జన్యానికి పూనుకుని, ఇతర పక్షాలవారిలో "వీరిని మనం ప్రతిఘటించకపోవడం భీరుత్వం" అనే పట్టుదలను రేకెత్తించారు. దీనికి అంతటికీ పర్యవసానం ఏమంటే,—హిట్లర్ డిక్టేటర్

కాకపూర్వం ఆస్ట్రియాలో దాదాపు నూటికి 80 మంది జర్మ నీతో ఐక్యతను అభిలషించారు; అతడు డిక్టేటరు అయిన తర్వాత కనీసం నూటికి 60 మంది అది కూడదనే నిశ్చయానికి వచ్చారు.

పార్లమెంటును రద్దుచేసి డాక్టరు డోల్ఫస్ ఆస్ట్రియాకు డిక్టేటరు కాకపూర్వమే ఆస్ట్రియన్ నాజీలు దౌర్జన్యాన్నీ, దుండగాలనూ చేస్తున్నారు. ఇక అతడు డిక్టేటరు అయిన నాటికి వారు మరీ హద్దుమీరి పోయారు. లాఠీలతో మోదడం, తుపాకుల్ని కాల్చడం, బాంబుల్ని విసరడం, రైళ్లని పడగొట్టడం, బ్రిడ్జిలను పగలగొట్టడం, సభల్ని చెల్లా చెదరు చెయ్యడం—ప్రతిరోజూ, ప్రతి చోటనూ ఇలా దౌర్జన్యానికి పూనుకోవడమే! ఇలా దుండగాలను చెయ్య డమే!! దీన్ని సహించనని డాక్టరు డోల్ఫస్ దౌర్జన్యానికి ప్రతి దౌర్జన్యాన్ని, దుండగానికి బదులు దుండగాన్నీ చెయ్యసాగాడు. ఇది క్రమంగా ఆస్ట్రియా-జర్మనీల వైరంగా పరిణమించింది. బవేరియా న్యాయశాఖామంత్రి డాక్టరు ఫ్రాంక్ నాజీ ప్రచా రాన్ని చెయ్యడానికి వస్తూవుంటే, అతడు రాగూడదని ఆజ్ఞా పించాడు, డాక్టరు డోల్ఫస్. ఇందుకు ప్రతీకారంగా ఆస్ట్రి యాకు విహారార్థం వెళ్ళే జర్మన్ పౌరులు 1000 మార్కుల (ఇది జర్మన్ నాణెం) జరిమానాను చెల్లించాలని ఉత్తరువుచేసి, ఆస్ట్రియన్ జాతీయాదాయానికి నష్టాన్ని కలిగించాడు, హిట్లరు. దీనికి కినిసి ఆస్ట్రియన్ నాజీపార్టీ అక్రమ

సంఘం అని ప్రకటించి దాన్ని నిషేధించాడు డాక్టరు డోల్ఫస్. నాజీపార్టీని కేవలం నిషేధించడమే కాకుండా అతడు నాజీలను వరసపెట్టి అరెస్టు చేయించాడు కూడా. ఒక్క నెలలో— జూన్ నెలలో—డోల్ఫస్ అరెస్టు చేయించిన నాజీల సంఖ్య దాదాపు పన్నెండు వందలు. వారిలో ఏడుగురు జడ్జీలు, ముగ్గురు పబ్లిక్ ప్రాసిక్యూటర్లు, యాభై యిద్దరు స్కూల్ మాస్టర్లు, ముప్పై యేడుగురు మిలటరీ పోలీసులు, అరవై మంది రైల్వే పనివాళ్ళు, ఎనభై మంది మేయర్లు, నూటపదకొండుమంది మునిసిపాలిటీల మెంబర్లు, ముప్పైఏడుమంది లాయర్లు. ఈ అరెస్టులతోపాటు దేశంలోని నాజీపార్టీ ఆఫీసుల్ని అన్నింటినీ వశపర్చుకున్నాడు. విదేశీయులైన నాజీలను వెళ్ళగొట్టించి వేశాడు. ఈ సమయంలోనే అతడు ఆస్ట్రియన్ నాజీనాయకుడు హాబీఖ్ట్‌ను కూడా— ఇతడు ప్రష్యా దేశస్థుడు— అరెస్టు చేయించాడు. హాబీఖ్ట్ అరెస్టు సంగతి తెలియగానే హిట్లర్ కోపం పట్టలేక, బర్లిన్‌లోని ఆస్ట్రియన్ లెగేషన్ (రాయబారి కార్యాలయం) వుద్యోగి నొకడిని—ఇతడి పేరు డాక్టర్ ఎర్విన్ వాజరుబోక్— లెగేషన్‌లోని ప్రచారకశాఖకు అధికారి ఈ వుద్యోగిని ఇంగ్లీషులో "ప్రెస్ అటాచీ" అని అంటారు—అరెస్టు చేయించాడు. అప్పుడు డాక్టరు వాజరుబోక్‌ను విడుదల చేయించడంకోసం హాబీఖ్ట్‌ను వదిలిపెట్టక తప్పింది కాదు. అయితే డోల్ఫస్ హాబీఖ్ట్‌ను ఆస్ట్రియాల్లో వుండనివ్వలేదు; జర్మనీకి తరిమివేశాడు. ఇందుకు జవాబుగా

కాబోలు, హిట్లరు తన తరఫున ఆస్ట్రియా వ్యవహారాలను నడపడానికి హాబీష్ట్‌ను 'ఇన్‌స్పెక్టరు-జనరల్'గా నియమించాడు! తర్వాత డాక్టరు డోల్ఫస్‌కు విరుద్ధంగా జర్మన్ రేడియోలు తీవ్ర ప్రచారాన్ని సాగించడమూ, జర్మన్ విమానాలు ఆస్ట్రియా సరిహద్దులలోకి వెళ్ళి, నాజీకరపత్రాల్ని విసిరి రావడమూ, చివరికి 1933 అక్టోబరు 3వ తేదీనాడు సాయంత్రం 2-15 గం టలకు ఆస్ట్రియన్ నాజీపార్టీ వా డొకడు డాక్టరు డోల్ఫస్‌ను తుపాకితో కాల్చి చంపబోవడమూ, జరిగింది. ఈవిధంగా నాజీ దౌర్జన్యం మితిమీరడమూ, ఆస్ట్రియా—జర్మనీల వైరం పెచ్చుపెరగడమూ చూచి, బ్రిటన్—ఫ్రాన్సు—ఇటలీ రాజ్యాలు 'దీనిని ఇకముందు సహించడం కష్టంసుమా!' అని హిట్లరుకు వర్తమానం చేశాయి. దాని తర్వాత నాజీలు కొంత చల్ల బడ్డారు గాని, డాక్టరు డోల్ఫస్ చిక్కులు ఇంతటితో తీరలేదు.

ఈ స్థితిలో ప్రధాన సంఘటనలు మూడు జరిగాయి. వీటిలో మొదటిది ఏమంటే,—ముస్సోలినీ డోల్ఫస్‌ను తన చంకకిందికి చేరదీసి, ఆస్ట్రియాకు కేవలం గార్డియన్ కావడం. ఇటలీ సరిహద్దులో శక్తిమంతులైన ప్రష్యనులు (జర్మనీవారు) వుండడంకంటె, నిస్సహాయులైన ఆస్ట్రియనులు వుండడమే ఏనాటికైనా మంచిది. పైగా, ఇటలీలోని సౌత్ టైరోల్ రాష్ట్రంలో రెండు లక్షలమంది జర్మన్‌జాతివా రున్నారు. వారికి జర్మనీ ఎంత దూరంగా వుంటే, ఇటలీకి అంతక్షేమం. ఈ రెండు కారణాలవల్ల ఆస్ట్రియా నాజీల వశంకాగూడదని

ముసోలిని నిశ్చయించాడు. ఇతర కారణాలవల్ల డోల్ఫస్ కూడా ఇలాంటి నిశ్చయానికే వచ్చాడు గనక, అతడు మూడు సార్లు రోంనగరానికి ప్రయాణం కట్టడమూ, 'నేనున్నంతవరకు నీకు భయంలేదులే!' అని ముసోలినీ అభయహస్తం ఇవ్వడమూ, జరిగింది.

ఇక, రెండో సంఘటన ఇది: హైమ్‌వీర్ దళాధిపతులకు— ప్రిన్స్ ఎర్నెస్ట్ రూడిగర్ వాన్ స్టార్ హెంబర్గ్, మేజర్ ఎమిల్ ఫే అనే వారిద్దరికీ— డాక్టర్ డోల్ఫస్ అంతకంతకు అధికంగా అధికారాన్ని అప్పజెప్పవలసిన అగత్యం కలగడం. కాలం గడచినకొద్దీ హైమ్‌వీరు తోడ్పాటు లేకుండా డోల్ఫస్ తన అధికారాన్ని నిలబెట్టుకోలేని స్థితి ఏర్పడింది. దీన్ని సాకుగా పెట్టుకుని హైమ్‌వీరు దళాధిపతులు తమ షరతుల్ని డిక్టేట్ చెయ్యసాగారు. వారి షరతులకు లోబడి అతడు సోషలిష్టు పార్టీవారి షుట్జ్‌బండ్ సైనికదళాన్ని అక్రమసంఘంగా ప్రకటించాడు; ప్రముఖులైన సోషలిష్టు నాయకుల్ని అనేక కష్టాలకు గురి చేశాడు; వియన్నా సోషలిష్టు మునిసిపాలిటీవారి ఆర్థికసంబంధమైన అధికారాన్ని తగ్గించి పారవేశాడు. ఇలాగే మరి ఎన్నో పాడు పనుల్ని చేశాడు. ఇలాంటి పనుల్ని చేసినకొద్దీ, అతడి అధికారం తగ్గడమూ, అతడు అధికంగా హైమ్‌వీరు దళాధిపతుల చేతిలో కీలుబొమ్మ కావడమూ జరిగింది.

పోతే, చివరి సంఘటన ఇది: ఆస్ట్రియన్ మంత్రివర్గపు తొమ్మిది శాఖలలో అయిదింటికి డాక్టరు డోల్ఫస్ స్వయంగా

అధిపతి అయ్యాడు. అయినప్పటికీ అతడికి ప్రజాస్వామిక రాజ్యాంగ విధానం కంటకప్రాయంగా తోచింది. అందుచేత దాన్ని రద్దుచేసి, దాని స్థానంలో అతడు తనకు పూర్తిగా నిరంకుశాధికారాన్ని ఇచ్చే "టోటలిటేరియన్" రాజ్యాంగ విధానాన్ని ప్రకటించాడు. ఈ క్రొత్త విధానం ప్రజామోదాన్ని పొందాలనే తలంపుతో అతడు "ఫాదరులాండ్ ఫ్రంట్" అనే జాతీయోద్యమాన్ని ప్రారంభించాడుకూడా! అన్నట్టు, అతడు ఈ రెండు పనుల్ని చేసింది, ముసోలినీ అమోదం మీదనే!

ప్రధానమైన ఈమూడు సంఘటనలు జరిగేసరికి ఆస్ట్రియన్ రాజకీయ పరిస్థితులు ఇవి: అంతకుపూర్వం దేశంలో క్రిస్టియన్ కాథొలిక్కులు, సోషలిస్టులు— వీ రుభయులు మాత్రమే రాజ్యాధికారంకోసం సంఘర్షిస్తూ వుండేవారు. ఇప్పుడు మూడు విభిన్న పక్షాలవారి మధ్య ఈ సంఘర్షణ జరగసాగింది. సోషలిస్టులు, నాజీలు, హైమ్‌వీరు తోడ్పాటుతో డాక్టరు డోల్ఫస్: వీరే ఆ మూడు విభిన్నపక్షాలవారూనూ. ఈసంఘర్షణ భవిష్యత్తు చెప్పడం దుస్సాధ్యంగా కనబడింది. డోల్ఫస్ మధ్యలో వుండి, ఇటు మితవాదులతోనూ అటు అతివాదులతోను పోరాడవలసి వచ్చింది. నాజీలూ, సోషలిస్టులూ ఏకమైతే, వారు డోల్ఫస్‌ను కూలదొయ్యగలిగేవారే! కాని, వారు చెయ్యి కలపడం అసంభవం. ముఖ్యంగా హిట్లరు బతికివుండగా ఇలాంటి ఆలోచనకైనా వీలులేదు. ఇది ఇలా వుండగా

నాజీలూ, హైమ్‌వీరుసైన్యంవారూ రహస్యంగా రాయ బారాల్ని జరపసాగారు.

ఈ పరిస్థితు లన్నింటిని చూడగా, నాజీలతో రాజీ పడితే తన చిక్కులు తీరుతాయేమో అనే ఆశ డోల్ఫస్‌కు కలిగింది. అంచేత ఆస్ట్రియా స్వాతంత్ర్యానికి భంగం రాని పక్షంలో తాను రాజీకి అంగీకరిస్తానని అతడు తెలియబరిచాడు. హిట్లరుకూడా ఇందుకు "సరే" అన్నాడు. రాజీ షరతుల్ని గురించి చర్చించడానికి హెర్ హబీక్ట్ 1934 జనవరి 8 వ తేదీ నాడు డాక్టరు డోల్ఫస్‌ను కలుసుకోవాలని నిర్ణయం జరిగింది. ముందుగా అనుకున్నప్రకారం సరిగా వేళకు హబీక్ట్ మ్యూనిచ్ నుంచి విమానంలో వియన్నాకు ప్రయాణ మయ్యాడు. ఇంత జరిగిన తర్వాత తుది క్షణంలో డోల్ఫస్ రాజీ ప్రయత్నాన్ని విరమించానని ప్రకటించాడు. చేసిన వాగ్దానాలకు భిన్నంగా 7వ తేదీ రాత్రి నాజీలు దౌర్జన్యాలను చేశారు గనక, తాను తన ఉద్దేశాలను మార్చుకోవలసి వచ్చిందని డోల్ఫస్ అన్నాడు. ఈ కారణం ఎంతవరకు సత్యమైందో తెలియదు గాని, వియ న్నాకు ప్రయాణమై వెడుతున్న హబీక్టుకు రేడియో సందే శాన్ని పంపి, మధ్యదారిలో నుంచి హిట్లరు వెనక్కు రప్పించ వలసి వచ్చింది!

ఆ పై వారంలో ఇటాలియన్ విదేశాంగశాఖ సహాయ మంత్రి సీనార్ సూనిచ్ వియన్నాకు వెళ్ళి, డోల్ఫస్‌కు

యీవిధంగా సలహా చెప్పాడు: "ఒకవైపున నాజీలు, ఇంకో వైపున సోషలిస్టులు, వీ రుభయులు నిన్నూ, నీ ప్రభుత్వాన్నీ ప్రతిఘటిస్తున్నారు. వీ రుభయులతోనూ నీవు ఏక సమయంలో పోరాడలేవు. అంచేత ఏదో ఒక పక్షాన్ని ముందుగా హాత మార్చాలి. ఇది కష్టసాధ్యమైన పని కావచ్చు. కాని, దీన్ని సాధించి తీరాలి. ఎంచేతనంటే,— ముందుగా ఇలా ఒక పక్షాన్ని హాతమార్చితే, ఇక మిగిలినదాన్ని ఎదుర్కోవడం అతి సులభం."

ఈ సలహా చక్కగా వున్నట్టు క్షణంలో గ్రహించి, "అయితే ముందుగా హాతమార్చవలసింది ఎవరిని?" అని డాక్టరు డోల్ఫస్ అడిగాడు. "సోషలిస్టుల్ని" అని జవాబు చెప్పాడు, సీనారు సూనిచ్.

ముసోలినీ బంటు— సీనారు సూనిచ్—సోషలిస్టుల్ని ముందుగా హాతమార్చాలని అనడానికి అనేక కారణా లున్నాయి. ముసోలినీకి నాజీలంటే కోపం లేకపోలేదు. అయితే నాజీలపై కంటెకూడా సోషలిస్టులపైన ఎక్కువ కోపం వుంది. ఇందుకు తోడు ముఖ్యంగా ఆస్ట్రియన్ సోషలిస్టులు అంటే, అతడికి చాలా కడుపుమంట. హంగరీలోని ఫేసిస్టులకు వియన్నాగుండా రహస్యంగా ఆయుధాల్ని సరఫరా చెయ్యాలని అతడు 1933లో కాబోలు ప్రయత్నించాడు. అప్పుడు ఆస్ట్రియన్ సోషలిస్టులు ఈ విషయాన్ని బయటపెట్టారు. ఇలా ఇంకా ఎన్నో కారణాలు......

కారణాలు ఏమైతే నేమి? ముసోలినీ సలహాను డోల్ఫస్ ఆమోదించాడు. ఆమోదించి, సోషలిస్టుల మీద విరుచుకు పడ్డానికి తగిన తరుణంకోసం ఎదురు చూడసాగాడు!

# 10

ఎందుకైనా మంచిదని అనుకున్నాడు కాబోలు,— డాక్టరు డోల్ఫస్ హంగరియన్ ప్రభుత్వంవారి ఆహ్వానాన్ని అంగీకరించి, బుడాపెస్ట్ నగరానికి వెళ్ళాడు. ఇలా అతడు ముఖం తప్పించడమేమో, హైమ్‌వీరు సైనికదళం సోషల్ డిమోక్రాటిక్ పక్షంవారిమీద దౌర్జన్యాన్ని ప్రారంభించడమేమో! డాక్టరు డోల్ఫస్ తన ప్రయాణాన్ని హైమ్‌వీరు దౌర్జన్యానికి 'సిగ్నల్'గా ఏర్పాటుచేశా డనే నాడూ నేడూ కూడా లోకం నమ్మకం.

హైమ్‌వీరు సైనికదళంవారు 1934 జనవరి 31 వ తేదీ మొదలు ఫిబ్రవరి 6 వ తేదీ వరకు టైరోల్, అప్పర్ ఆస్ట్రియా, స్టైరియా, బర్జెన్‌లాండ్ రాష్ట్రాలలో గవర్నమెంట్ హౌసులమీదికి దండెత్తివెళ్ళి, ఆరు షరతుల్ని చెప్పి, వాటికి అంగీకరించవలసిందిగా నిర్బంధించారు. వారు చెప్పిన ఆరు షరతుల్ని అంగీకరిస్తే, దాదాపుగా మిలటరీ గవర్నమెంటును అంగీకరించినట్టే!

అక్రమమైన ఈ నడవడినీ, అన్యాయమైన ఈ షరతుల్ని చూడగానే ప్రజాసముదాయంలో—ముఖ్యంగా సోషల్ డిమోక్రాటిక్ పార్టీవారిలో— కలిగిన అలజడికి అంతులేదు.

తర్వాత నాలుగు రోజులలోను జరిగిన సంఘటనలు ఇవి:

ఫిబ్రవరి 9: సాల్జ్‌బర్గ్ రాష్ట్రంలోని హైమ్‌వీరు నాయకులు గవర్నరు వద్దకు వెళ్ళి, మిలటరీ గవర్నమెంట్‌ను ప్రకటించవలసిందిగా నిర్బంధించారు. లోయరు ఆస్ట్రియా గవర్నరు స్థానికవు హైమ్‌వీరు నాయకులకు— వారి షరతులు అక్రమాలనే కారణంమీద- దర్శనం ఇవ్వడానికి నిరాకరించాడు. సోషలిస్టుపార్టీని అక్రమసంఘంగా ప్రకటించవలసిందనీ, వియన్నా సిటీహాల్‌ను ఆక్రమించుకోవలసిందనీ, హైమ్‌వీరు దళాధిపతులు ప్రభుత్వాన్ని నిర్బంధిస్తున్నారని తెలిసి, అలా జరిగేపక్షంలో దేశం మొత్తంమీద సమ్మె జరిపించుతామని సోషలిస్టు ప్రధాన కార్యస్థానంవారు ప్రకటించారు. డాక్టరు డోల్ఫస్ బుడాపెస్టునుంచి తిరిగివచ్చి, హైమ్‌వీరు నాయకులతో సమాలోచన జరిపాడు.

ఫిబ్రవరి 10: వైస్ ఛాన్సలరు — అంటే హైమ్‌వీరు ప్రధాన నాయకులలో వొకడైన మేజరు ఫే— వియన్నా మేయరుకూ, ఇతర పురపాలక సంఘాధికారులకూ ప్రజాశాంతి రక్షణ విషయంలో గల అధికారాల్ని తొలగించాడు.

ఫిబ్రవరి 11 : హైమ్‌వీరు దళంవారి పేరేడ్ సందర్భం లో – ఆస్ట్రియన్ యుద్ధమంత్రి సమక్షాన – ఉపన్యసిస్తూ, మేజరు ఫే ఇలా అన్నాడు : 'హెర్ డోల్ఫస్ మన పక్షాన్నే వున్నట్టు గడచిన రెండు రోజులలోనూ నేను నిశ్చయంగా తెలుకున్నాను. రేపు మనం ఆస్ట్రియాను తుడిచిపెట్ట బోతున్నాము.'

ఎంత అన్నాడో అంతా చేసి చూపించాడు మేజరు ఫే! ఫిబ్రవరి 12 వ తేదీనాడు ఆస్ట్రియా అంతటిలోనూ అంతర్యుద్ధం ప్రారంభమైంది !!

# 11

అంతర్యుద్ధానికి 'విఘ్నేశ్వరపూజ' జరిగింది అప్పర్ ఆస్ట్రియా రాష్ట్రానికి ముఖ్యపట్టణమైన లింజ్‌లో. అక్కడి హైమ్‌వీర్ సైనికులు స్థానిక సోషలిస్టు కార్యస్థానాన్ని ఆక్రమించుకోబోయారు. ఈ ప్రయత్నాన్ని సోషలిస్టులు ప్రతిఘటించారు. దానితో యుద్ధం ప్రారంభమైంది.

లింజ్ నగరమునుంచి యుద్ధవార్తలు రాగానే, వియన్నాలోకూడా సంఘర్షణ ప్రారంభమైంది. వియన్నా తర్వాత, ఇతర రాష్ట్రాలకుకూడా ఈ అంతర్యుద్ధజ్వాలలు అలుముకున్నాయి. ఇలా దేశాన్ని అంతటినీ చుట్టుముట్టిన ఈ జ్వాలలు అయిదారు రోజుల తర్వాత ప్రజారుధిరంలో చల్లారిపోయాయి!

హైమ్‌వీర్ నాయకులు (పన్నుగడ పన్ని) ప్రారంభించిన ఈ అంతర్యుద్ధ కారణంగా ఒక్క వియన్నా నగరంలోనే దాదాపు వెయ్యిమంది— వీరిలో అనేకులు స్త్రీలూ, శిశువులూ!— హతులైనారు. తొమ్మిదిమంది సోషలిస్టు నాయకులు— తీవ్రంగా గాయపడి, "స్ట్రెచర్" మీద ఆసుపత్రికి వెడుతున్న వ్యక్తిని కూడా కలుపుకుని తొమ్మిదిమంది— ఉరి కంబానికి బలి అయిపోయారు తుపాకి గుళ్ళ తాకిడికి కారల్ మార్క్సు హాఫ్, గెటీహాఫ్— ఇవి రెండూ వియన్నా పురపాలక సంఘం నిర్మించిన కార్మిక భవనాలు— ముక్క చెక్కలై పోయాయి. ఇంత జరిగిన తర్వాత వియన్నాలో శాంతి ఏర్పడింది. అయితే ఇది సుభిక్షంగానూ, సుఖప్రదంగానూ వున్న నగరంలో వుండే శాంతి కాదు. శ్మశానవాటికలో వుండే శాంతి!!

ఇక ఈ అంతర్యుద్ధం తర్వాత డాక్టరు డోల్ఫస్‌కూ, హైమ్‌వీర్‌కూ దక్కిన లూటీ ఇంతింత కాదు. వియన్నాలో దాదాపు మూడువంతుల నివేశన స్థలం ఆ నగరంలోని సోషలిస్టు మ్యునిసిపాలిటీవారిది. వారి కింద పనిచేస్తున్న వారి సంఖ్య— యాభైనాలుగువేలు. 1923 నుంచి 1929 వరకు కార్మికులకు గృహ వసతులు మొదలైనవాటిని కల్పించడానికి వారు దాదాపు రెండుకోట్ల ఇరవై లక్షల పౌనుల్ని వెచ్చించారు. మ్యునిసిపల్ సేవింగ్స్ బ్యాంకులలో వారిపేర నిలవ వున్న మొత్తం,— ఒక కోటి నలభై లక్షల పౌనులు. శిస్తుల రూపంగా సగటున సాలుకు వారికి వచ్చే ఆదాయం,— యాభై లక్షల పౌనులు.

ఇంతేకాదు, మ్యునిసిపల్ గ్యాస్‌వర్క్సు, పవరుహౌస్, ట్రాములు, అన్ని బస్సులు, ట్యూబ్ రైళ్ళు, మాంసం మార్కెట్లు, ఒక సిమెటెరీ (శ్మశానం), ఒక బ్రూయెరీ (సారా ఫ్యాక్టరీ), ఒక బేకరీ (రొట్టెల దుకాణం), ఒక పెద్ద డిపార్టుమెంట్ స్టోరు (అన్ని వస్తువుల్ని అమ్మేషాపు)— ఇవి అన్నీ వియన్నా సోషలిస్టు మ్యునిసిపాలిటీవారి ఆస్తులే! ఇవి అన్నీ కూడా—అంతర్యుద్ధం తర్వాత—ప్రభుత్వ వశమై పోయినవి. వేలకొలది ప్రజలు బందీలైనారు; వేలకొలది ఉద్యోగభ్రష్టులైనారు. మొత్తంమీద అంతర్యుద్ధ కారణంగా ప్రజాసామాన్యానికి కలిగిన కష్టనష్టాలకు మితిలేదు.

## 12

దేశంలో బల మున్నది. చేతినిండా ధన మున్నది. అవసరమైతే అసువుల్ని నయిషం అర్పణ చేసే అనుచరవర్గ మున్నది. అయితే ఈ బలానికి, ఈ ధనానికి; ఈఅనుచరవర్గానికి తగిన నాయకులే లేరు. అంచేతనే ఆస్ట్రియన్ సోషల్ డిమోక్రాటిక్ పార్టీ అంతర్యుద్ధంలో అతి సులభంగా పరాజయాన్ని పొందింది. అన్నట్టు అది కేవలం పరాజయం మాత్రమే కాదు—సర్వవినాశనం!

ఆస్ట్రియన్ సోషల్ డిమోక్రసీ నాయకులలో ఓటో బవరు అగ్రగణ్యుడు. ఆయన యూదు జాతికి చెందినవాడు.

వయస్సు — అంతర్యుద్ధం నాటికి — యాభై అయిదు సంవత్స రాలు. అన్నివిధాల ఆయన పెద్దమనిషి. ఎంత పెద్దమనిషో అంత తెలివితేటలు గలవాడు కూడా! అయితే, ఆయన తెలివి తేటలు సిద్ధాంతాన్ని ప్రతిపాదించడంలోనే! ప్రతికక్షుల వాదాన్ని ఖండించవలసి వస్తే, ఆయన బుద్ధి ఎంతైనా నిశితంగా వుంటుంది. ఇక, రాజకీయ రంగంలో తలవని తలంపుగా ఏర్పడే క్లిష్టపరిస్థితుల్ని ఎదుర్కొనవలసి వస్తే, ఏమి చెయ్యాలో ఆయ నకు తోచదు. అలాంటి సందర్భాలలో "ఇంతకంటె బుద్ధి హీనుడు వుంటాడా?" అన్నట్టుగా ఆయన ప్రవర్తిస్తాడు. ఇంతేగాక; మానవ స్వభావాన్ని అర్థం చేసుకునే శక్తికూడా ఆయనకు బొత్తిగా లేదు. "రైక్షపోస్టు" ఎడిటరు అయిన సైపెల్ గొప్ప మేధావి అని ఓటో బవరు అభిప్రాయం. సైపెల్‌తో వివిధ సిద్ధాంతాల్ని గురించి ఖండన మండనల్ని జరపడమంటే ఆయనకు చాలా సరదా! ఇక, ఆయన దృష్టిలో డోల్ఫస్ వట్టి మూర్ఖుడు డోల్ఫస్ మరి ఏమయినా కావ చ్చునేమో గాని, మూర్ఖుడుమాత్రం కాదు. దీన్నిబట్టే ఓటో బవరు మానవస్వభావాన్ని ఎంతగా అపార్థం చేసుకుంటాడో తెలుస్తున్నది! ఒకప్పుడు ఓటోబవరు బహిరంగసభలో డోల్ఫ స్‌ను "స్కౌండ్రిల్" (దొంగ) అని అన్నాడు. ఈ మాటను డోల్ఫస్ మరిచిపోనూలేదు; దీన్ని అన్న వ్యక్తిని క్షమించనూ లేదు. ఇంకొకరైతే, ఓటోబవరును సోషల్ డిమొక్రాటిక్ పార్టీనాయకత్వంనుంచి తొలగించడంతో సంతృప్తి పడేవారే.

కాని, ఓటోబవరుకు తన నాయకత్వంకంటే తన పార్టీయే ప్రధానమని డోల్ఫ్సస్‌కు తెలుసు. అంచేత పార్టీనీ, పార్టీతో పాటు దాని నాయకుణ్ణీ తన ప్రతిహింసకు బలి పెట్టాలని అతడు నిశ్చయించాడు.

నాయకత్వంలోని లోపాలకు అసలు సోషల్ డిమోక్రసీ సిద్ధాంతంలోనే వున్న లోపాలుకూడా తోడై, ఆపార్టీకి పతనాన్ని తెచ్చిపెట్టినవి. ప్రపంచంలో ఒకవైపున ఫేసిజం, ఇంకోవైపున కమ్యూనిజం భీషణంగా సంఘర్షిస్తూవుంటే, సోషల్ డిమోక్రసీ మధ్య నిలవగలదా? అవి రెండూ తీవ్ర వాదాలు; ఇది మితవాదం. అవి రెండూ శక్తిమంతమైనవి; ఇది నీరసమైంది. అవి రెండూ కాలానుగుణ్యమైనవి; ఇది తన కాలాన్ని మించి బ్రతికింది. మోటార్లు, విమానాలు వచ్చిన ఈకాలంలో గుర్రపుబళ్ళు, ఒంటెద్దుబళ్ళు ఎలా కనబడు తున్నవో, 1934 లో ఆస్ట్రియన్ సోషల్ డిమోక్రసీ కూడా అలాగే కనబడింది. సోషల్ డిమోక్రాటిక్ పార్టీవారు పని పాటలు లేక, ఆకలిదప్పులకు లోనై, మనకష్టాలు ఈడేరాలంటే, రాజ్యాధికారాన్ని వశపరుచుకోవలసిందే అని కృతనిశ్చయు లైన కార్మికులూ కాదు; కార్మికులను తొక్కిపట్టి తామే వరి పాలన సాగిస్తూ వుండాలని దౌర్జన్యానికి దిగుతున్న క్యాపిట లిస్టులూ కాదు. ఇక వా రెవరంటే — క్యాపిటలిష్టులకు సేవ చేస్తున్నవారు. కడుపునిండా కూడు తెచ్చుకుంటున్నవారు. అంచేత వారివైఖరిలో తీవ్రత వుండదు; వారి హృదయంలో

విప్లవాగ్ని వుండదు. వారు కోరేది సంస్కరణం. వారికి కావలసింది సౌకర్యాలు. ఆస్ట్రియన్ సోషల్ డిమోక్రాటిక్ పార్టీ వారు—ముఖ్యంగా వియన్నా నగరంలో—కొంత సంస్కరణ చెయ్యగలిగారు; కొన్ని సౌకర్యాలు పొందగలిగారు. అంచేత వారిలో ఒక విధమైన సంతృప్తి ప్రబలింది. దీనితో అంతకు పూర్వ మున్న స్వల్ప విప్లవోత్సాహంకూడా చచ్చింది. ఇదే వారి పతనానికి—వారి సర్వ వినాశనానికి—కారణమైంది.

ఆస్ట్రియన్ సోషల్ డిమోక్రాటిక్ పార్టీవారి పతనాన్ని గురించి జాన్ గంథరు ఇలా వ్రాశాడు: 'ఆస్ట్రియాలో సోషలిజం రూపుమాసిపోవడానికి దాని సౌమ్యతే కారణం. ఆస్ట్రియన్ సోషలిస్టులకు రక్తపాతం అంటేనూ, దౌర్జన్యం అంటేనూ పరమాసహ్యం. తమ శత్రువులు కర్కశత్వం ప్రదర్శిస్తారని గాని, నమ్మకద్రోహం చేస్తారనిగాని వారు అనుకోలేదు. తాము స్వయంగా అసత్యమూ, అన్యాయవర్తనమూ ఎరగని వారు గనక, తమ ప్రతికక్షులు ఆడిన అబద్ధాలను పసిపాపల్లా నమ్మారు.'

ఇక, ఫ్రాన్సిస్ గంథరు—ఈమె జాన్ గంథరు భార్య—ఇలా వ్రాసింది: 'ఆస్ట్రియన్ సోషలిస్టుల పతనానికి లోపభూయిష్ఠమైన వారి సిద్ధాంతాలే కారణం. తాము సోషలిస్టులు కావడంచేత కార్మికుల డిక్టేటరుషిప్‌ను స్థాపించవలసిందేనని వారి నమ్మకం. అయితే తాము డిమోక్రాట్సు కూడా

కావడంచేత, మెజారిటీ పార్టీ పరిపాలనకు భిన్నం జరగకూడ దని కూడా వారి నమ్మకం. పరస్పర విరుద్ధాలైన ఈ రెండు నమ్మకాలే వారికి వినాశనాన్ని తెచ్చాయి. భోగాల విషయం లోనేగాని, జీవితావశ్యకాల విషయమై వారు శ్రద్ధ చూపలేదు. ఆస్ట్రియక్ పరిశ్రమలకు కీలకమైన 'ఆల్ పైన్ మాంటాన్ గెసెల్ షాఫ్ట్'ను చేజిక్కించుకోడానికి 1919లోనే వారికి అవకాశం కనబడింది. ఈ అవకాశాన్ని వారు ఉపయోగించు కోలేదు. ఇందుకు బదులు వియన్నా నగరంలో సుందరమైన సరోవరాల్నీ ఉద్యాన వనాల్నీ సంపాయించుకోవడంతో వారు సంతృప్తి పడ్డారు...సోషలిస్టులైనందుకు వారు ఆయుధధారు లైనారు గాని, డిమోక్రాట్సుకూడా అయినందువల్ల తమ ప్రతికక్షుల చేతులలోని ఆయుధాల్ని ఊడబెరక లేక పోయారు.

డోల్ఫస్ తన డిక్టేటరుషిప్‌ను స్థాపించిన కొత్తలో సోషల్ డిమోక్రాటిక్ పార్టీ నాయకులు దేశం మొత్తంమీద సమ్మె జరిపించినట్లయితే, అతడి పీడ వదిలిపోయేదే! అయితే, అది అవసరమనే దూరదృష్టిగాని, దాన్ని జరిపించగల సాహసం గాని వారికి లేకపోయింది. "పార్లమెంట్ స్టీరింగ్ కమిటీని రద్దు చెయ్యకుండా వుంటే, రెండు సంవత్సరాల వరకు నిన్ను డిక్టేటర్‌గా వుండనిస్తాము" అని వారు బేరానికి దిగారు. డోల్ఫస్ ఇందుకు అంగీకరించలేదు. పోనీ, అప్పుడైనా వారు సమ్మె ప్రయత్నం చేశారా? అబ్బే, లేదు! "మా షుట్స్‌బండ్ చేత మేము అస్త్రసన్యాసం చేయిస్తాము. గవర్నమెంటువారు

తమ హైమ్‌వీర్ చేత అదేపని చేయిస్తారా ? అని తిరిగి బేరాలు సాగించారు. ఈ బేరాలు జరిపింది ఒకసారీ, రెండుసార్లు కాదు,— పదిహేనుసార్లు! డోల్ఫస్ ఇందుకు "ఔ"ననీ, "కా"దనీ చెప్పకుండా చల్లగా వూరుకున్నాడు. తర్వాత నాలుగు సందర్భాలను ఏకరువు పెట్టి, ఈ నాలుగు సందర్భాలలోను మేము సమ్మె జరపవలసివస్తుంది అని ప్రకటించారు. ఆ సంద ర్భాలు ఇవి: (1) ఆస్ట్రియాలో ఫేసిస్టురాజ్యాంగ విధానాన్ని ప్రవేశపెట్టినపుడు; (2) వియన్నా మ్యునిసిపాలిటీకి గవర్న మెంట్ కమిషనర్‌ను నియమించినప్పుడు; (3) సోషల్ డిమో క్రాటిక్ పార్టీని నిషేధించినప్పుడు; (4) ట్రేడ్‌యూనియన్లు (కార్మికసంఘాలు) చట్ట విరుద్ధమైన వని ప్రకటించినప్పుడు. సమ్మెజరిగే ఈ నాలుగు సందర్భాలను తెలుసుకున్నప్పుడు డోల్ఫస్ చంకలు ఎగరవేశాడు. ఎంచేతనంటే,—ఈ నాలుగు సందర్భాలను ఏర్పడ నియ్యనంతవరకు అతడు కోరిన ఆటను ఆడవచ్చునుగదా!

తాము చేసిన ఈ తప్పిదాన్ని ఓటో బవర్ చివరికి స్వయంగా అంగీకరించాడు. "ఆస్ట్రియన్ డిమోక్రసీపతనం" (Austrian Democracy Under Fire) అనే తన గ్రం థంలో ఆయన ఇలా వ్రాశాడు:

"1933 మార్చి 15.వ తేదీనాడు మేము దేశం మొత్తంమీద సమ్మెను సాగించవలసింది. జయప్రదంగా

సమ్మెను సాగించడానికి ఆనాడు పరిస్థితులు అనుకూలంగా వున్నట్లు మరెన్నడూ లేవు. సరిగా అప్పటికి పరిపక్వస్థితికి వస్తున్న నాజీవిప్లవం ఆస్ట్రియన్ ప్రజాబాహుళ్యాన్ని ఉత్తేజితుల్ని చేసింది. ఎప్పుడు పిలుపు వస్తుందా, ఎప్పుడు రంగంలోకి దూకుదామా అని కార్మికులందరు కనిపెట్టుకుని వున్నారు. ఆతర్వాత పదకొండు మాసాలకు జరిగినట్లు అప్పటికి రైల్వే కూలీలు దెబ్బతిని వుండలేదు. 1934 ఫిబ్రవరిలో వున్న బలం అప్పటికి గవర్నమెంట్ వారి సైనికదళానికి లేదుకూడా. అప్పటిలో అయితే మేము జయించేవారమేమో!

"కాని సంఘర్షణ అంటేనే మాకు భయం అనిపించింది. రాయబారాల వల్ల శాంతియుతంగా పరిష్కారం జరుగుతుందని మేము అప్పటికి ఇంకా నమ్ముతూనే యున్నాము. త్వరలోనే మీతో రాయబారాల్ని నడుపుతానని డోల్ఫస్ మాకు వాగ్దానం చేశాడు ... అప్పటి మాబుద్ధిహీనతకొద్దీ మేము డోల్ఫస్ వాగ్దానాన్ని నమ్మాము. ఘోరమైన అంతర్యుద్ధ కారణంగా దేశంలో రక్తపాతం జరగనివ్వరాదనే తలంపుతో మేము సమ్మెను వాయిదా వేశాము. కాని పదకొండు మాసాల తర్వాత అంతర్యుద్ధం రాక తప్పలేదు. పైగా, అది వచ్చిననాటికి పరిస్థితులు మాకు ఎంతో తక్కువ అనుకూలంగా వున్నాయి. అది పొరపాటు — మేము చేసిన అన్నింటిలోనూ అతి ఘోరమైన పొరపాటు."





ఔను! ఇది అతి ఘోరమైన పొరపాటే! ఈ పొరపాటు ఫలితం,—ఆస్ట్రియన్ సోషల్ డిమోక్రసీ సమూల వినాశనం!

# 13

'ఓటో బవర్, బోల్షివిక్కుల ఏజంటు. విప్లవాన్ని చెయ్యడానికి అతడు కుట్ర చేస్తున్నాడు. ఈ రహస్యాన్ని కనిపెట్టి, మేము అతడి కుట్రప్రయత్నాన్ని భగ్నం చేశాము'—దారుణ దౌర్జన్యానికి దిగి, సోషల్ డిమోక్రాటిక్ పార్టీని రూపుమాపిన తర్వాత డోల్ఫస్ చేసిన ప్రకటన సారాంశం ఇది. డోల్ఫస్ చేసిన ప్రకటన ప్రకారం బోల్షివిక్కుల ఏజెంట్ అయిన ఓటో బవర్ తెల్లవారితే అంతర్యుద్ధం ప్రారంభమౌతుందనగా ఆరాత్రి—ఫిబ్రవరి 11 రాత్రి—చేస్తున్న కుట్ర ప్రయత్నం ఏమంటే,—భార్యనూ, ఇద్దరు స్నేహితుల్నీ వెంట పెట్టుకొని సినిమాకు వెళ్ళి 'గ్రాండ్ హోటల్'లో గ్రెటా గార్బోను చూడ్డం! సినిమానుంచి ఇంటికి తిరిగి వచ్చేసరికి లింజ్‌లోని షుట్స్‌బండ్ నాయకుని వద్దనుంచి ఆయనకు 'రేపు వుదయం హైమ్‌వీర్ దుండగీళ్ళు మా కార్యాలయం మీద దండెత్తుతా రని తెలుస్తున్నది. వారు నిజంగా దండెత్తితే, మేము వారిని ప్రతిఘటిస్తాము' అని కబురు వచ్చింది. ఈ కబురు తెలిసే సరికి ఓటో బవర్ చాలా ఆందోళనపడిపోయి, త్వర

పడవద్దంటూ ఇలా టెలిగ్రాం పంపించాడు: "అత్తయ్య క్షేమం ఇద్దరు డాక్టర్లతోపాటు మామ ఓటోకూడా ప్రస్తుతం ఏమీ చెయ్యకూడ దని అభిప్రాయపడుతున్నారు." ఈ టెలిగ్రాం సకాలంలో అందినప్పటికీ, లింజ్‌లోని షుట్స్‌బండ్ నాయకుడు దీన్ని లక్ష్యపెట్టక మర్నాటి వుదయం తమ కార్యాలయంమీద జరిగినదాడిని ప్రతిఘటించాడు.

లింజ్‌లో పోరాటం ప్రారంభమైన సంగతి వుదయం ఎనిమిది గంటలకు ఓటోబవర్‌కు తెలిసింది. వెంటనే ఆయన ట్రేడ్ యూనియన్ ఎగ్జిక్యూటివ్ కమిటీనీ, సోషల్ డిమోక్రాటిక్ పార్టీనీ సమావేశ పరిచాడు. ఈ సమావేశంలో దేశం మొత్తంమీద సమ్మె జరిపించాలనే తీర్మానం ఒక్క వోటు మెజారిటీతో నెగ్గింది. ఒక వైపున ఈ సమావేశం జరుగుతూ వుండగానే, యింకోవైపున ఎలక్ట్రికల్ యూనియన్ కార్మికులు—లింజ్‌నుంచి వచ్చిన వార్తల్ని విని, కోపావేశులై తమంతటతాముగా సమ్మెను ప్రారంభించారు. అంచేత తీరా సమ్మె తీర్మానం జరిగిన తర్వాత, దాన్ని అచ్చు వెయ్యాలంటే ఎలక్ట్రిక్ పవర్ లేకపోయింది. ప్రెస్ పని చెయ్యలేదు. పార్టీనుంచి ఆదేశం రాకమునుపే ఎలక్ట్రిక్ యూనియన్ కార్మికులు సమ్మె జరపడంవల్ల, సమ్మె తీర్మానాన్ని ప్రకటించడానికే వీలు లేకపోయింది! ఈ అవక తవక పనివల్ల కలిగిన నష్టం ఎంతో చెప్పడానికి వీలు లేదు!!





నమ్మో సాయంత్రం అయిదుగంటలకు ప్రారంభం కావాలని తీర్మానంలో వున్నదట! దీని వుద్దేశం ప్రభుత్వాన్ని బెదిరించడమట! తీర్మానం వుద్దేశం ఏమైనా, అసలు జరిగింది ఏమంటే,— ప్రభుత్వానికి తగిన జాగ్రత్తల్ని వహ్డానికి ఏడు గంటల వ్యవధి చిక్కింది. దీని తర్వాతకూడా అన్నీ అవకతవ కలే! అంతా తెలివితక్కువే! సోషలిష్టులలో ప్రముఖులైన వారందరు డోల్ఫుస్ దగ్గరికి డిప్యుటేషన్ వెళ్ళారు. ఈ అవ కాశాన్ని డోల్ఫుస్‌లాంటివాడు వృథాగా పోనిస్తాడా? అతడు వారి నందరిని ఒక్కసారిగా అరెష్టు చేయించాడు. పోతే, పార్టీకి ఆర్డర్లను ఇవ్వడానికి ఒక్క ఓటో్బవర్ మిగిలాడు. ఆయనకూడా డిప్యుటేషన్‌లో చేరవలసిందే గాని; డోల్ఫుస్ అంటే తన కున్న విద్వేషంవల్ల ఆపని జరగలేదు. కనీసం ఆయ నైనా బయట మిగలడం కొంతమేలే గాని, ఒక్కడు ఏమి చేయగలడు? సరిగా సాయంత్రం అయిదు గంటలకు దేశం లోని రైళ్ళు అన్నీకూడా ఆగిపోవలసింది. కాని, నమ్మో తీర్మా నం జరిగిన సంగతి తెలియకపోవడంవల్ల రైళ్ళు అన్నీకూడా యథాప్రకారం నడిచాయి. ఇతర ప్రాంతాలకు నమ్మో సంగతి తెలియబరచడానికి వార్తావహుల్ని పంపించారు. కాని, వారిని డోల్ఫుస్ దారిలోనే అరెస్టు చేయించాడు. యుద్ధం చేస్తున్నవారికీ, యుద్ధాన్ని నడపవలసినవారికీ సంబం ధాన్ని కూర్చడానికి ఒక కమిటీని ఏర్పాటు ... అయితే,

సమావేశ స్థలాన్ని గురించి పొరపాటు జరగడంవల్ల ఈ కమిటీ అసలు సమావేశం కానేలేదు !

ఇక యుద్ధాన్ని గురించి చెప్పనక్కర్లే లేదు. అది యుద్ధం కాదు.—ఊచకోత ! "డిసిప్లిన్" పేరు చెప్పి ఓటో బవర్ పార్టీని మృతప్రాయం చేశాడు. అంచేత తిరగబడి యుద్ధానికి వెళ్ళాలని ఆతురపడుతున్న యువకులు కూడా పైనుంచి ఆర్డర్లు రాలేదనే కారణంచేత సోమ, మంగళవారాలు ఉత్తినే ఊరుకున్నారు. కాని, అసలు ఆర్డర్లు రానేలేదు. చివరకి మరి లాభం లేదని ఎవరికి వారు తుపాకిని చేపట్టారు. దీని పర్యవసానం వేరే చెప్పాలా? తుపాకి పట్టిన ప్రతి యువకుడు హైమ్ వీర్ దళంవారి క్రౌర్యానికి బలి అయ్యాడు. అసలు ఫిబ్రవరి 3వ తేదీనాటికే గవర్నమెంట్ వారు—షుట్ప్‌బండ్ దళంలోని ద్రోహులు ఇచ్చిన భోగట్టాను బట్టి—షుట్ప్‌బండ్ నాయకులలో ముఖ్యమైనవారిని అరెస్టు చేశారు. అంచేత చాలామంది కార్మికులకు తమ పక్షంవారు ఆయుధాలను దాచిన స్థలం ఏదో కూడా తెలియలేదు. రహస్య ఆయుధగారాలున్న ప్రదేశం ఏ కొద్దిమందికి మాత్రమో తెలుసు. ఈ కొద్దిమందీ బందీలై పోయారు. అంచేత సోమ, మంగళవారాలు రెండు రోజులు కూడా అనేకమంది కార్మికులు తమ భవనాల ఆవరణలను విపరీతంగా [illegible]దకడం, ఎంత వెదికినా ఆయుధాలు కనబడక పోవడం

షుట్స్‌బండ్ దళాలలో ఒకదానికి ఒక తుపాకి కూడా లేకపోయింది. ఇందుకు కారణం ఆయుధాలు లేకపోవడమా? కాదు, మరి ఆయుధాలు ఎక్కడ వున్నవో తెలియకపోవడమా? ఇదీ కాదు. దళాధిపతి అరెస్టులో వున్నప్పటికీ, అతని తరువాత వాడికి ఆయుధా లున్న చోటు తెలుసు. అయితే, దళాధిపతి దగ్గరినుంచి ఆర్డరు రానిదే ఆయుధా లున్న చోటును బయట పెట్టడానికి వీలులేదని అత డన్నాడట! ఆ మూర్ఖుడు అరెష్టులో వున్న దళాధిపతి ఆర్డరు ఎలా పంపుతా డని అనుకున్నాడో తెలియదు! తక్కిన దళాధిపతులు కూడా దాదాపు ఇంత మూర్ఖత్వాన్ని చూపారు! ఒక దళాధిపతి తా నున్న చోటి నుంచి ఒక పోలీసుదళాన్ని అతి తేలికగా "మెషిన్‌గన్" చెయ్యగలిగేవా డట! కాని, సోషలిష్టు లెవ్వరు ప్రతికక్షులు ముందు తమమీద కాల్చనిదే తాము కాల్చగూడదనే ఉత్తరువు వున్నందువల్ల పోలీసువారు తనమీద ఎప్పుడు కాలుస్తారా అని కనిపెట్టుకు కూర్చున్నాడట. ఈ వ్యవధిలో పోలీసువారు చక్కని మరుగు చూచుకున్నారట! ఓటో బవరు అమలులో పెట్టిన "డిసిప్లిన్" ఫలితమే ఇదంతా!

సోషల్ డిమోక్రాటిక్ పార్టీవారు ఎంత మూఢ్యంగా ప్రవర్తించారో, డోల్ఫస్ అంత బుద్ధిసూక్ష్మతను ప్రకటించాడు. కార్మికుల భవనాల కున్న టెలిఫోను తీగల్ని అతడు తెగగొట్టించాడు. అందుచేత ఎవరు ఇంకా పోరాడుతున్నారో, ఎవరు శరణాగతులైనారో కార్మికులకు తెలియలేదు.

ఇందుకు తోడు గవర్నమెంట్ వారు రేడియో ద్వారా అంతూ పంతూ లేని అసత్య ప్రచారాన్ని సాగించారు. ఈ ప్రచార సందర్భంలో ఓటోబవర్ ట్రేడ్ యూనియన్ల డబ్బు ఎత్తుకు పారిపోయాడని ప్రకటించడానికి కూడా వారు సంకోచించలేదు!

సోషల్ డిమోక్రాటిక్ పార్టీ నాయకత్వాన్ని గురించి ఎన్నిలోపాలనైనా చూపించ వచ్చును గాని, పార్టీ సభ్యుల్ని గురించి నెపం ఎన్నడానికైనా వీలు లేదు. మెషిన్ గన్సు, ఆర్మర్డ్ కార్సు, ఫీల్డ్ ఆర్టిలరీ, ఈ ఆయుధ సంపత్తి అంతా వున్న పందొమ్మిది వేల సైనికులు, వట్టి తుపాకులతోనూ— అనేక సందర్భాలలో ఆ తుపాకులు సయితం లేకుండానూ— పోరాడుతున్న షుమారు అయిదు వేల షుట్స్‌బుండర్సును లొంగదియ్యడానికి నాలుగు రోజులు పట్టింది! విజయం పొందగలమనే ఆశ రవ్వంతకూడా లేక పోయినా, ఆ అయిదు వేలమంది నిరుపమానమైన ధైర్య స్థైర్యాలను ప్రదర్శించారు.

వియన్నా కార్మికులు ఈ అంతర్యుద్ధంలో చూపిన వీరత్వాన్ని కార్మిక ప్రపంచం ఎన్నటికీ విస్మరించలేదు!

## 14

సోషల్ డిమోక్రాట్సను చిత్రవధ చేసిన తర్వాత— వారి రక్తంచేత సిక్తమైన హస్తాలతో — డాక్టరు డోల్ఫస్ "కార్పొరేటివ్" రాజ్యాంగ విధానాన్ని ప్రవేశపెట్టాడు.

ఈ నూతన రాజ్యాంగవిధానాన్ని చూచినవారికి పందొమ్మిదో శతాబ్దిలో మాదిరిగానే తిరిగి ఇరవయ్యో శతాబ్దిలో కూడా ఆస్ట్రియా నిరంకుశత్వానికీ, మత మౌఢ్యానికీ కేంద్రం అవుతుందా అని అనుమానం తోచసాగింది. నూతన రాజ్యాంగ విధానం ప్రజాప్రాతినిధ్యానికి తావు లేకుండా చేసింది. హాప్సుబర్గ్ రాజులకు అవసరమైతే తిరిగి పట్టం కట్టడానికి సందు ఏర్పరిచింది. పాత పార్లమెంటును రద్దు చేసి 'గిల్డ్సు' (వృత్తిని బట్టి ఏర్పడే సంఘాలు) ద్వారా ఎన్నికలు జరిగే పద్ధతిని కొత్తపార్లమెంటును సమావేశ పరిచింది.

నూతన రాజ్యాంగ విధానాన్ని ప్రవేశ పెట్టడంలో డోల్ఫస్‌కుగాని, ఆస్ట్రియాకుగాని చిక్కులు తీరలేదు సరిగదా, అవి మరింత యెక్కువైనాయి డోల్ఫస్‌ను తప్పించి తానే ఆస్ట్రియాకు ఛాన్సలర్ కావాలని స్టార్ హెమ్‌బర్గు యత్నించసాగాడు. స్టార్‌హెంబర్గ్‌ను తోసివేసి, తానే హైమ్‌వీర్ నాయకుడు కావాలని మేజర్ ఫే కుట్రచెయ్యసాగాడు. వారి దురాశలు, వారి ద్వేషాలు పోనీ ఇంతటితో ఆగినవా? లేదు. హైమ్‌వీర్ అంతకంతకు బలపడుతున్నదనీ, ఇందువల్ల తనకు ప్రమాదం తప్పదనీ డోల్ఫస్ ఇంకొక ప్రయివేటు సైన్యం అభివృద్ధికి సహాయపడ నారంభించాడు. ఈసైన్యంపేరు-ష్ట్రిమ్సు ఛారెన్. దీనినాయకుడు— న్యాయశాఖా మంత్రి డాక్టరు షూష్నిగ్. కాథోలిక్ మతాభిమానంలో షూష్నిగ్ డోల్ఫస్‌కు మిన్న. పైగా ఆస్ట్రియా చిక్కులు తీరాలంటే,

హాప్స్‌బర్గు రాజవంశ పరిపాలనను పునరుద్ధరించాలని అతడు గట్టిగా నమ్మేవాడుకూడా! షూష్నిగ్ స్థాపించిన ప్రొవిన్సు ఛార్జర్ సైన్యం అభివృద్ధికి డాక్టరు డోల్ఫస్ తోడ్పడ్డాన్ని చూచి, హైమ్‌వీర్‌వారు నాజీలతో ఏకంకావడానికి ఎత్తులు వేయసాగారు. ప్రభుత్వపక్షంలో పుట్టిన ఈ పుండుమీద వాలి, చీము నెత్తురుల్ని పీల్చుకుంటూ, నాజీ ఈగలు బాగా బలిసి పోసాగాయి.

సోషల్ డిమోక్రాటిక్ పార్టీని రూపు మాపడంవల్ల ప్రయోజనాన్ని పొందింది డోల్ఫస్ కాదు,—నాజీ పార్టీ. 'ముందు సోషల్ డిమోక్రాట్లను హతమార్చి వెయ్యి, ఆ తర్వాత నాజీలమీద దండెత్తవచ్చు' అని ముసోలినీ సలహా చెప్పాడు. డోల్ఫస్ ఈ సలహాను అంగీకరించాడు. అయితే, సోషల్ డిమోక్రాటిక్ పార్టీ వినాశనంతో ప్రజాస్వామిక సిద్ధాంతం భగ్నమై పోయింది; ప్రజాశక్తి గంగకలిసిపోయింది. ఇందుమూలంగా నాజీలకు కలిగిన లాభం ఇంతంత కాదు. ఆస్ట్రియాలో నాజీజం తల యెత్తాలంటే, ముందుగా సోషలిస్టు డిమోక్రాటిక్ పార్టీని హతమార్చ వలసి వుండేది. ఆపనిని నాజీలు చెయ్యవలసిన అగత్యం లేకుండా, డోల్ఫస్ చేసి వేశాడు. అందువల్ల శ్రమ ఏమీ లేకుండా నాజీలకు కొండంత బలం వచ్చింది.

డోల్ఫస్ అవివేకం వల్ల—అతడి అదూరదృష్టివల్ల—తమకు చేకూరిన ఈ బలాన్ని చూచుకొని, ఇక తాము పూర్తిగా విజృంభించవచ్చునని నాజీలు నిశ్చయించుకొన్నారు. ఇంతేకాదు. తాము విజృంభించడంలో ఏమాత్రం ఆలస్యం జరగగూడ దని కూడా వారనుకున్నారు త్వరలో ముసోలినీ వద్దకు ఇంకొకసారి వెళ్ళిరావాలని డోల్ఫస్ అనుకుంటున్నాడు. ఈ యాత్ర తర్వాత పరిస్థితులు తమకు ప్రతికూలం కావచ్చును. పైగా, నిన్నమొన్ననే తమకు ఘోరాన్యాయం జరిగి వుండడంవల్ల సోషలిస్టులు డోల్ఫస్ మీద కోపావేశులై వున్నారు. ఈ కోపం చల్లారితే, వారు—నాజీజం పట్ల తమకున్న బద్ధవైరాన్ని పురస్కరించుకుని—డోల్ఫస్‌కు సహాయపడవచ్చును. అంచేత ఆలస్యం విషప్రాయ మౌతుంది. త్వరపడాలి, డోల్ఫస్‌ను హతమార్చాలి. ఈ ఆలోచనలతో ప్రేరితులై నాజీలు తిరిగి దౌర్జన్యానికీ, దుండగాలకూ పూనుకున్నారు.

నాజీలు చెలరేగడాన్ని చూచి, డోల్ఫస్ చాలా ఆందోళనపడ్డాడు. "ఈసారి దౌర్జన్యం జరిపినవాడిని ఉరివేస్తాను" అని అనేకసార్లు బెదిరించాడుగాని, ఒక్క నాజీనికూడా ఉరితియ్యడానికి అతడు సాహసించలేక పోయాడు. ఇందుకు కారణాలు ఇవి: (1) నాజీలు ప్రతిహింసకు పూనుకుంటారేమోనని అతడు భయపడ్డాడు; (2) అతడి ఉద్యోగులే అతడికి ద్రోహం చెయ్యసాగారు; (3) నాజీ దుండగీళ్ళను మరణశిక్ష

ద్వారా వీరుల్ని చెయ్యడం కూడనిపనిగా అతడికి తోచింది; (4) ఎప్పటికైనాసరే జర్మనీతో రాజీకి రావడానికి సందు వుంచుకోవడం మంచి దని అతడు భావించాడు.

నాజీ దుండగీళ్ళను ఉరి తియ్యడానికి ధైర్యం చాలలేదు గనక, వారిని కొంచెం భయపెట్టడానికి ఒక సోషలిస్టును ఉరి తియ్యగూడదా అని డోల్ఫస్‌కు తోచినట్టుంది. ఇలా అనడం ఎంచేతనంటే,—పోలీసువాడి నొకడిని గాయపరిచాడనే నేరానికి జోసెఫ్ గెర్ల్ అనే సోషలిస్టు యువకుడిని అతడు 1934 జులై 24 వ తేదీనాడు ఉరితీశాడు. ఇలా ఉరితీసిన ఇరవైనాలుగు గంటలలో తానే నాజీల చేతులలో హత్య అయ్యాడు!

డోల్ఫస్ ఎవడో సోషలిస్టు యువకుడిని ఉరి తియ్యడమేమిటి? ఇందుకు ప్రతీకారమా-అన్నట్టు నాజీలు డోల్ఫస్‌ను హత్య చెయ్యడమేమిటి? ఇది వింతగా కనబడవచ్చును. కాని, జరిగిన యథార్థం ఇంతే!

చాటున దాగిగాని, హఠాత్తుగా ఎదురుపడిగాని, గుంపులో నిలబడి గాని, చప్పున రివాల్వర్ తియ్యడం—గురి పెట్టడం—ఢాం అని పేల్చడం—శవం నేలమీద దొర్లడం: రాజకీయహత్య అనగానే సాధారణంగా మనోఫలకం మీద చిత్రితమయ్యే దృశ్యం ఇదే! కాని, డోల్ఫస్ హత్య జరిగిన విధం ఇది కాదు. అసలు అది హత్య కాదు,— పెద్ద కుట్ర! పెద్ద తిరుగుబాటు!!

ఈ కుట్రలో—ఈ తిరుగుబాటులో— మొత్తం నూట నలభై నాలుగు మంది పాల్గొన్నారు. వారిలో అధిక సంఖ్యాకులు ఒకప్పుడు ఆస్ట్రియన్ సైన్యానికి చెందినవారే! నాజీ వుద్యమంలో చేరి పని చేస్తున్నందుకు డాల్ఫస్ చాలామందిని బర్తరఫ్ చేశాడు. ఇలా బర్తరఫ్ అయినవారు నాలుగు రహస్య దళాలకింద ఏర్పడ్డారు. ఈ దళాలవారికి వియన్నా పోలీసు వుద్యోగులలోని కొందరు ప్రముఖులు కూడా, తోడయ్యారు. వీరందరు జులై 25 వ తేదీనాడు పట్టపగలు డాల్ఫస్‌ను హత్య చేశారు.

ఈ హత్యాకాండకు నాయకత్వం వహించినవాడు,— డాక్టర్ అన్‌టాన్ రిన్‌టెలెన్. అతడి పూర్వీకులు జర్మనీలోని వెస్ట్ఫేలియాకు చెందినవారు. అతడి తండ్రి గ్రాజ్ కళాపరిషత్తులో ప్రొఫెసర్. అక్కడనే—అంటే, గ్రాజ్‌లోనే— రిన్‌టెలెన్ జన్మించాడు. చదువు పూర్తిచేసుకొని డాక్టరేట్‌ను సంపాయించుకున్నతర్వాత, అతడు గ్రాజ్ కళాపరిషత్తులో తండ్రితోపాటు ప్రొఫెసర్ అయ్యాడు. తర్వాత 1918 లో స్టైరియన్ రాష్ట్రీయ శాసనసభకు సభ్యుడయ్యాడు. ఆ మరునటి సంవత్సరంలో స్టైరియన్ రాష్ట్రానికి గవర్నర్ అయ్యాడు. ఈగవర్నర్ హోదాలో స్టైరియన్ రాజకీయ రంగంలో అతడు విశేషమైన పలుకుబడిని గడించుకున్నాడు. తర్వాత 1926 లో ఆస్ట్రియాకు విద్యామంత్రి

అయ్యాడు. రెండు సంవత్సరాలపాటు మంత్రిగా వున్నతర్వాత 1928 లో తిరిగి తన గవర్నరు పదవినే స్వీకరించాడు.

రిన్ టెలెన్ చాలా చురుకైనవాడు; విశేష శక్తిసామర్థ్యాలు గలవాడు, బొత్తిగా పాపభీతి లేనివాడు. ఆస్ట్రియన్ ఛాన్సలరు కావాలనే ఆశ అతడికి పట్టుకుంది. సోషల్ డిమోక్రాటిక్ పార్టీ సహాయంతో ఈ పదవిని పొందాలని ముందుగా అతడు యత్నించాడు. కాని, ఆ యత్నం సాగలేదు. తర్వాత అతడు నాజీలతో కుట్ర సాగించాడు. నాజీలకు రిన్ టెలెన్ అంటే ఇష్టం గాని, నమ్మకంగాని లేదు. అయితే, ముందు రిన్ టెలెన్‌తో కలిసి "కోయిలిషన్ గవర్నమెంటు" ను ఏర్పాటు చెయ్యవచ్చుననీ, ఆతర్వాత నెమ్మదిగా అతడిని తప్పించవచ్చుననీ వారు యోచన చేశారు. జర్మనీలో హిట్లరు ఇంతకుపూర్వం హెర్ వాన్ పాపెన్ ను ఇలాగే ఉపయోగించుకున్నాడు. అక్కడ పారిన ఎత్తు ఇక్కడ పారదా? ఈ దిలాసాతోనే ఆస్ట్రియన్ నాజీలు నాజీకాని రిన్ టెలెన్‌ను తమ నాయకుడుగా ఎన్నుకున్నారు. ఒక రాష్ట్రానికి గవర్నరుగా వుంటూ విశేషంగా పలుకుబడిని సంపాయించుకున్న రిన్ టెలెన్ నాజీ పక్షంతో కుట్ర చెయ్యడం ఆస్ట్రియాకు ఎంతనష్టమో ప్రథమంగా గ్రహించినవాడు, ముసోలినీ. అతడు—డాక్టరు డోల్ఫస్ 1933 ఆగష్టులో తనను చూడవచ్చినప్పుడు—రిన్ టెలెన్ విషయమై హెచ్చరించాడట. "అతడిని నాదగ్గరికి పంపించు. నేను అదుపాజ్ఞలలో పెడతాను" అని ముసోలినీ

ఆ సమావేశంలో డోల్ఫస్‌తో అన్నాడట. ఈ మాటమీద డోల్ఫస్ 1934 ప్రారంభంలో రిన్‌టెలెన్‌ను రోంనగరానికి ఆస్ట్రియా రాయబారిగా పంపించాడు.

అయితే రిన్‌టెలెన్‌ను దేశంనుంచి పంపించివేసినంత మాత్రాన కుట్రప్రయత్నాలకు భంగం రాలేదు. జర్మనీనుంచి స్టైరియాకు యథాప్రకారం రహస్యంగా ఆయుధాలు సరఫరా కాసాగాయి. యథాప్రకారమే స్టైరియాలో నాజీదళ నిర్మాణం సాగిందికూడా! చివరికి కుట్ర ప్రయత్నాలు అన్నీ ముగిసిన తర్వాత—డోల్ఫస్ హత్యకు ఏర్పాట్లు అన్నీ జరిగిం తర్వాత—జులై 23 వతారీఖున— విశ్రాంతికోసం అంటూ సెలవుపెట్టి—రిన్‌టెలెన్ రోంనగరం చేరుకున్నాడు.

డోల్ఫస్‌ను హత్య చేసినవారు ఎవరైనా, ఆ హంతకులకు నాయకత్వం వహించినవాడు ఎవడైనా, అసలు ఆహత్య బాధ్యత అంతా హిట్లర్‌దే! దౌర్జన్యానికి దిగండనీ, తిరుగుబాటు చెయ్యండనీ అతడు మ్యూనిక్ రేడియో స్టేషన్‌నుంచి రాత్రింబగళ్ళు ప్రచారం చేయించాడు. జర్మనీనుంచి చేయించిన ఈ ప్రచారం కాక, ఆస్ట్రియాలో కూడా ఇదేమాదిరి ప్రచారం జరగడానికి 1933 జనవరి, 1934 జులై మాసాల మధ్య దాదాపు 7,50,00,000 మార్కులను ఖర్చు చేశాడు. ఇక, డోల్ఫస్ హత్యకు హిట్లరే బాధ్యుడని అనడంలో తప్పేమిటి? ఇంతే కాదు. జులై 25 నాటి తిరుగుబాటు

సంగతి హిట్లరుకు ముందుగానే తెలుసు. ఈ విషయాన్ని నిరూపించడానికి వున్న ఎన్నో నిదర్శనాలలో కొన్ని ఇవి:

మొదటి నిదర్శనం: హబీష్ట్, ఫ్రాన్‌ఫెల్డ్ అనే ఇద్దరు నాజీనాయకుల్ని విద్రోహం జయప్రదమైనట్టు వార్త రాగానే వియన్నాకు పంపించాలనే వుద్దేశంతో జులై 25 వ తేదీనాటి వుదయం తొమ్మిది గంటలకు మ్యూనిక్ నాజీపార్టీ కేంద్ర కార్యాలయంవారు ఒక విమానాన్ని సిద్ధంగా వుంచారు.

రెండో నిదర్శనం: జులై 21 వ తేదీనాడే బర్లిన్ ఫోటోగ్రాఫ్ ఏజన్సీవారొకరు 'రిన్‌టెలెన్: ఆస్ట్రియా కొత్త ఛాన్సలర్— త్వరలో ప్రకటించే నిమిత్తం' అంటూ పత్రికలకు అతని ఫోటో పంపించారు.

మూడో నిదర్శనం: ఎబెరెగెర్ అనే ఒక నాజీ రహస్యంగా ఆస్ట్రియా సరిహద్దులలోకి బాంబులను జేరవేస్తూవుండేవాడు. ఇతడిని ఆస్ట్రియన్ వుద్యోగులు ఇన్సుబ్రిల్‌లో అరెస్టు చేశారు. తర్వాత జరిగిన విచారణలో— ఈ విచారణ ఫలితం: ఆజన్మ కారాగారవాస శిక్ష— ఇతడు మ్యూనిక్‌నుంచి జులై 23 వ తేదీనాటికే మరి మూడు రోజులకు ఆస్ట్రియాలో తిరుగుబాటు జరగనున్నట్టు తనకు కబురు వచ్చిం దని చెప్పాడు.

నాల్గవ నిదర్శనం: ఆస్ట్రియానుంచి పలాయనమై వచ్చిన నాజీలను హిట్లర్ "ఆస్ట్రియన్ లీజియన్" అనే ఒక దళం కింద కూర్చాడు. ఈ దళంవారు 24 వ తేదీ సాయంత్రానికి

ఆస్ట్రియా సరిహద్దు వైపుకు వెళ్ళి, సరిహద్దుకు రెండు మైళ్ళ దూరంలో మకాం వేశారు.

అయిదో నిదర్శనం, ఆరో నిదర్శనం అంటూ మరి ఎన్నింటినైనా ఇలాగే ఉదాహరించ వచ్చును. కాని, ఇది అనవసరం. డోల్ఫస్ హత్యకు హిట్లరే పూర్తిగా బాధ్యుడు. ఇందుకు సందేహం లేదు. తాను అధికారానికి రావడానికి తోడ్పడినవారినే— వారితో తన కిక పని లేదని తోచినప్పుడు— హిట్లర్ స్వయంగా హత్య చేశాడు. ఇలాంటి హంతకుడు తన స్వార్థం సిద్ధించడంకోసం, తన కల నిజం కావడంకోసం, తన జన్మభూమి ఆస్ట్రియా తన పరిపాలనకిందికి రావడంకోసం డోల్ఫస్‌ను హత్యచేయించడానికి వెనుదీస్తాడా?

## 16

ఉదయం పదకొండు గంటలు అయ్యేసరికి కుట్రదారులు వియన్నా వీధులలో అక్కడక్కడ సమావేశమయ్యారు. వారి ఏర్పాట్లు చాలా చక్కగా జరిగాయనే చెప్పాలి. ఎందుచేతనంటే,— ఏవిధమైన ఆలస్యంగాని, ఆటంకంగాని లేకుండానే వారు అనుకున్న పనులు అనుకున్నట్టు చకచక జరిగాయి. ఒక జట్టు— మనిషి మనిషిచొప్పున— కోలోవాట్ రింగ్ అనేచోట చేరింది. ఈ జట్టులోనివారికి . ఆ క్రితంరాత్రి ఆయుధాలు సప్లయి అయినాయి. ఆయుధాలు అందడంతోపాటు తాము

ఎక్కడికి వెళ్ళవలసిందీ, ఏమి చెయ్యవలసిందీ తెలిసిందికూడా! వీరిలో కొందరికి తమనాయకులు ఎవర్నెదీ తెలియనే తెలియదు. ఇంతేకాదు. వీరు చాలావరకు పరస్పరం అపరిచితులు కూడా! అయినప్పటికీ '89' అంకెను సాంకేతికంగా పెట్టుకుని, దాని సహాయంతో ఏ పొరపాటూ రాకుండా వీరు సమావేశం కాగలిగారు.

కోలోవాట్ రింగ్ దగ్గర చేరిన ఈ జట్టులోనుంచి పధ్నాలుగుమంది కాలినడకను బయల్దేరి "రవాగ్" (ఆస్ట్రియన్ రేడియో కేంద్రకార్యాలయం) వైపుకు వెళ్ళారు. అన్నట్టు ఈ పధ్నాలుగుమంది మారువేషాలు లేకుండా మామూలుగానే వెళ్ళారు. "రవాగ్" పరిసరాలలోకి వెళ్ళేసరికి వారికి ఇద్దరు పోలీసువాళ్ళు— యూనిఫారంలో వున్నవాళ్ళు— ఎదురయ్యారు. వారిద్దరుకూడా కుట్రదారులలోనివారే! యూనిఫారంలో వున్న తాము దరిదాపులలో వుంటే, కుట్రదారుల మీద ఎవ్వరికీ అనుమానం కలగదుగదా అనే వుద్దేశంతో వారక్కడ వున్నారు.

రెండునిమిషాలు తక్కువ ఒంటిగంటకు కుట్రదారులు రవాగ్ భవనాన్ని ప్రవేశించారు. వాకిటిలో కాపలావున్న పోలీసువాణ్ణి— కుట్రలో చేరనివాణ్ణి— చంపివేశారు. వాకిటికి దగ్గరిగా జోగుతున్న మరొకడినికూడా— ఇతడు రవాగ్ డైరెక్టర్ మోటారుడ్రైవరు— కాల్చివేశారు. తర్వాత ఒకనలుగురు

స్టూడియోలో ప్రవేశించారు. అక్కడ గ్రామఫోన్ రికార్డుల బ్రాడ్‌కాస్ట్ జరుగుతున్నది. ఒక్క దూకు దూకి, "ఎనౌంసరు"ను (బ్రాడ్‌కాస్ట్ కార్యక్రమాన్ని, వార్తల్ని ప్రకటించే వాడిని) పట్టుకుని, వాడిగుండెలకు పిస్తోలును గురిపేసి, వాడి చేత "డోల్ఫస్ గవర్నమెంట్ రాజీనామా యిచ్చింది; డాక్టరు రిన్ టెలెన్ ప్రభుత్వాధికారాన్ని స్వీకరించాడు" అని ప్రకటింపజేశారు. ఈ ప్రకటన తిరుగుబాటు చెయ్యడానికి యావద్దేశానికి సంజ్ఞ అని అదివరకే నిర్ణయమైంది

ఈ లోపుగా ఇంకొక పెద్దజట్టు జీబెన్ స్టెర్న్‌గానే వీధి లోని జర్మన్ ఎథిలిటిక్ క్లబ్ భవనంలో చేరింది. ఈ జట్టులో మొత్తం నూట నలభై నాలుగు మంది వున్నారు. వీరిలో నూట ఆరుమంది ఆస్ట్రియన్ సైన్యంలోనుంచి బర్తరఫ్ అయిన వారే! పోగామిగిలినవారిలో పదిమంది పోలీసువుద్యోగులు. వీరు బర్తరఫ్ అయినవారు కాదు,—ఇంకా వుద్యోగంలో వున్నవారే!

మధ్యాహ్నం ఒంటిగంటకు ఛాన్సలరీ (ఆస్ట్రియన్ ప్రభుత్వకార్యాలయం) మీద దండెత్తివెళ్ళడానికి కుట్రదారులు నిర్ణయించుకున్నారు. సరిగా ఒంటిగంటకే అని నిర్ణయించుకోడానికి బలమైన ఒక కారణం వుంది. అది ఏమంటే,— ఒంటిగంటకు ఛాన్సలరీకి పహరా ఇచ్చే జట్లలో మార్పు జరుగుతుంది. ఈ మార్పు జరుగుతూవుండగా యెదిరిస్తే నెగ్గడం తేలిక !

అయితే ఉదయం షుమారు పదిగంటలకు డాబ్లరు అనే పోలీసు ఉద్యోగి— ఇతడు నాజీకుట్రలో చేరినవాడేగాని ఎందు వల్లనో తిరిగిపోయాడు— షుమారు పదిగంటలకు డాబ్లరుకుట్ర రహస్యాన్ని ప్రభుత్వాధికారులకు తెలియజేశాడు. వారు వెంటనే జాగ్రత్తపడినట్లయితే, డోల్ఫుస్‌కు ప్రాణమోసం తప్పేదే! కాని అంతకుపూర్వం అనేకసార్లు పుట్టిన కుట్ర వదంతుల మాదిరిగానే యిదికూడా నిరాధారమైన దని అనుకున్నారు.

ఆపూట డాబ్లర్* కుట్రసంగతిని ప్రభుత్వాధికారులకు తెలియపరచడానికి పడ్డపాట్లకు అంతులేదు. నిజాన్ని తెలియ బరచాలి; కాని, నాజీలకు తనమీద అనుమానం కలగకూడదు. ఈ తాపత్రయంలో అతడు ఆనాటిఉదయం పది, పదకొండు న్నర గంటలమధ్య మొత్తం మూడుసార్లు ప్రభుత్వాధికారుల్ని కలుసుకున్నాడు. ఈ మూడుసార్లు కూడా అతడు అధికారుల్ని కలుసుకున్నది కాఫీహోటల్సులోనే. ఈ మూడుసార్లూ అతడు అధికారుల్ని రప్పించింది రకరకాల మధ్యవర్తులద్వారానే!

పదకొండుగంటల పదిహేనునిమిషాలకు ప్రజాశాంతి రక్షణమంత్రి అయిన మేజర్ ఫే అంగరక్షకుడికి—— ఇతడిపేరు మేజరు రాబెల్ —— కుట్రసంగతి తెలిసింది. వెంటనే అతడు

* డాబ్లర్ కొన్ని రోజులతర్వాత ఆత్మహత్య చేసుకున్నాడు. ఇది ఆత్మహత్యకాదు,—హత్య అనికూడా కొందరు అంటారు.

నమ్మకస్థుడైన గూఢచారి నొకడిని—మారెక్ అనే వాడిని—విచారణ చెయ్యడానికి పంపించాడు. తర్వాత అరగంటకు (పదకొండు ముప్పావుకు) మేజర్ ఫే కు కుట్రసంగతి చూచాయగా తెలిసింది. తనకు తెలియడమే తడవుగా మేజరు ఫే ఛాన్సలరీలో సమావేశమై వున్న మంత్రివర్గానికి ఈ సంగతిని అందజేశాడు. మొదటిలో డోల్ఫస్ అంత లక్ష్యపెట్టలేదు గాని, పదేపదే హెచ్చరికలు రావడాన్ని చూచి, పదినిమిషాలు తక్కువ ఒంటిగంటకు మంత్రివర్గ సమావేశాన్ని చాలించి, అందరిమంత్రుల్ని— మేజరు ఫేనూ, అతడి అసిస్టెంట్ కార్లిన్ స్కీని తప్ప—పక్క భవనంలో వున్నతమ తమకార్యాలయాలకు వెళ్ళిపొమ్మన్నాడు.

ఈ లోవుగా డిటెక్టివ్ మారెక్ (గూఢచారి) జీబెన్ స్టెర్న్ గాసేదగ్గరికి చేరుకున్నాడు. కుట్రదారులవెంట యూనిఫారంలోవున్న పోలీసుల్ని చూచినవెంటనే అతడు "వారు కుట్రదారులు కారేమో" అని అనుకున్నాడు. కాని, క్రమక్రమంగా అతనికి సందేహం కలుగసాగింది. అప్పు డతడు పది పన్నెండున్నర మధ్య మూడుసార్లు (ఒకసారి పబ్లిక్ ఫోన్-స్టాండ్ లోనుంచీ, ఒకసారి కాఫీహోటల్ లోనుంచీ, మూడోసారి ఫర్నిచర్ షాపులోనుంచీ) మేజర్ రాబెల్ కు ఫోన్ చేశాడు. రాబెల్ తనకు జీబెన్ దగ్గరనుంచి వచ్చిన రిపోర్టుల్ని ముందు ప్రజాశాంతిరక్షణవుద్యోగులకు, తర్వాత పోలీసు హెడ్ క్వార్టర్సుకు తెలియపరిచాడు. ఈ రిపోర్టులఆధారంతో

ప్రభుత్వంపట్ల విశ్వాసపాత్రంగావున్న పోలీసువారు చర్యజరపా లని యత్నించారు గాని, నాజీలతో చేరిన పోలీసు గూఢచారులు కుట్రసన్నాహం నగరంలో మరి ఏమూలనో జరుగుతున్నదని చెప్పి మోసపుచ్చారు.

మారెక్ మూడోసారి ఫోన్ చేసి వచ్చేసరికి కుట్రదారులు అతడి రహస్యాన్ని కనిపెట్టి, కాళ్ళుచేతుల్ని పట్టుకుని అతడిని ఎథిలిటిక్ క్లబ్ హాలులోకి ఈడ్చుకు వెళ్ళారు. పట్టుబడి పోయి మారెక్ లోపలికి వెళ్ళేసరికి కుట్రదారులు ఆర్మీయూనిఫారంలోకి— వియన్నా డాయిష్ మైస్టర్ దళంవారి యూనిఫారంలోకి— మారుతున్నారు. తర్వాత కాసేపటికి కుట్రదారులు మూడు ప్రయివేట్ ట్రక్కులలో ఎక్కి ఛాన్సలరీకి బయలుదేరారు. మారెక్‌ను ఏమిచెయ్యాలో వారికి తోచలేదు. అంచేత అతడిని తమతోపాటు తీసుకువెళ్ళారు! ఛాన్సలరీని సమీపిస్తూవుండగా, మారెక్ ఎలాగో తప్పించుకుని కిందికిదూకి పారిపోయాడు. పారిపోతూవున్నవాడిని కావాలంటే కుట్రదారులు కాల్చివెయ్యగలిగేవారే! అయితే, తమ తుపాకిమోత ప్రజలదృష్టిని ఆకర్షిస్తుందేమో నని వారు చల్లగా వూరుకున్నారు! అసలు తుపాకిమోత అవసరం లేకుండానే పట్టపగలు పెద్ద పట్టణంలో జనసమర్దంగావున్న వీధులగుండా యూనిఫారంలోవున్న నూటనలభై నాలుగు మంది సైనికులతో మూడు ట్రక్కులు వెళ్ళడమే ప్రజాదృష్టిని ఆకర్షించవలసింది. కాని ఆ రోజులలో వియన్నా వీధులలో సైనికదళాలు తిరగడం

సామాన్యమే! పైగా ట్రక్కుల రన్నింగ్ బోర్డ్సుమీద యూనిఫారంలో వున్న పోలీసులు అనుమానానికి ఆస్కారం లేకుండా చేశారు.

డోల్ఫస్ మంత్రివర్గ సమావేశాన్ని చాలించిన అయిదు నిమిషాలకు— ఒకటీయాభై అయిదునిమిషాలకు— కుట్రదారులు ఛాన్సలరీలో ప్రవేశించారు. ప్రవేశించడమే తడవుగా వారు మేజరు ఫేనూ, ఆతడి అసిస్టెంట్ కార్విన్‌స్కీనీ, ఛాన్సలరీ వుద్యోగులు దాదాపు నూటయాభై మందినీ, ఛాన్సలరీ పహరా వాళ్ళు అరవై మందినీ అరెస్టుచేశారు. అరెస్టుచేసినవారిలో పద్ధెనిమిదిమందిని— మేజరు ఫే, కార్విన్‌స్కీలు కాక, మరి పదహారుమంది వున్నతోద్యోగుల్ని— మంత్రి వర్గసమావేశాలు జరిగే మందిరంలో బంధించారు. పోగా మిగిలినవారిని ఒక చిన్న పెరటిలోకి చేర్చి, వారికావుదలకు గట్టిబందోబస్తు చేశారు. ఈ పనులన్నీ క్షణమైనా విలంబనం లేకుండా చక చక జరిగి పోయాయి. కుట్రదారులవెంట వచ్చిన పోలీసు వారికి ఛాన్సలరీలోని ప్రతిగదీ, ప్రతిహాలూ, ప్రతిదారీ చక్కగా తెలుసు. అసలు వారిలో కొంత మంది అనేకసార్లు ఛాన్సలరీకి పహరా యిచ్చినవారే! ఇక తడబడవలసిన అవసరం ఏముందీ?

తక్కినవారు ఈ అరెస్టుల్ని జరుపుతూ వుండగా, కొంతమంది కుట్రదారులు ఓటో ప్లానెట్టా నాయకత్వంకింద—

ఇతడు ఆస్ట్రియన్ సైన్యంలో కార్పొరల్‌గా వుంటూవుండే వాడు; నాజీఉద్యమంలో చేరినందుకుగాను బర్తరఫ్ అయ్యాడు—డోల్ఫుస్‌ను హత్యచెయ్యడానికి బయలుదేరారు. వారు ఛాన్సలరీలోకి ప్రవేశించడమే తడవుగా మరి దేనిమీదికీ తమ దృష్టిని పోనివ్వకుండా, గబగబ మేడమెట్లను ఎక్కి వెళ్ళి, ప్రతి స్టేట్ డిపార్టుమెంట్‌నూ డోల్ఫుస్‌కోసం వెదకసాగారు. కావాలంటే డోల్ఫుస్‌నుకూడా అరెస్టుచెయ్యడానికి వీలున్నది. అయితే, వారికోర్కె అతడిని అరెస్టుచెయ్యడం కాదు,—హత్య చెయ్యడం. తర్వాత జరిగిన సంఘటనలనుబట్టి చూస్తే, "డోల్ఫుస్‌ను ప్రాణాలతో వదలవద్దు" అని వారు ఆజ్ఞాపితులైనట్టు తోస్తుందికూడా!

మంత్రివర్గసమావేశాన్ని చాలించిన వెంటనే డోల్ఫుస్ తన ప్రయివేట్ స్టడీలోకి వెళ్ళాడు (ఇది చిన్నగది. దీనిగోడలకు ఊదా సిల్కు లైనింగ్ వుంది). డోల్ఫుస్ సేవకుడు—అతడి పేరు హెడ్‌విక్—కిటికీలోనుంచి బయటికి చూచేసరికి, కుట్రదారుల ట్రక్కులు ఛాన్సలరీ ఆవరణలో ప్రవేశించడం కనబడింది. అతడు ఏదో చిక్కురొక్కు దారి చెప్పి, దానిగుండా పారిపోవలసిందిగా డోల్ఫుస్‌ను హెచ్చరించాడు. సరేనని, తానున్న ఊదాగదినుంచి చకచక బయలుదేరి, తెల్లగా వున్న మరొకగదిగుండా డోల్ఫుస్ 1815 లో వియన్నా కాంగ్రెసు జరిగిన హాలులోకి వెళ్ళబోయాడు. తెల్లటిగదికి మూడు ద్వారా

లున్నవి. ఇక వియన్నా కాంగ్రెసుహాలుకు అయిదు ద్వారా లున్నవి ఆ కాంగ్రెసులో అయిదుగురు రాజులు పాల్గొన్నారు. ఈ అయిదుగురిలో ఎవరు ముందు రావడం, ఎవరు వెనక రావడం అనే చిక్కు తీర్చడానికిగాను అయిదు ద్వారాల్ని పెట్టి, అయిదుగురుకూడా ఒకేసారి రావడానికి ఏర్పాటుచేశారు. ఆ గది మూడుద్వారాలలోనూ ఒకటి మేడమెట్లవైపు కున్నది; ఇంకొకటి వియన్నా కాంగ్రెసు హాలులో కున్నది. కాంగ్రెసు హాలుతలుపు తాళంవేసివుంటే దాన్ని తియ్యడానికి హెడ్విక్ తెచ్చుకుండావుంటే, ఈ లోపుగా మెట్లవైపు ద్వారంగుండా కుట్రదారులు గదిలో ప్రవేశించారు.

వారు లోపలికి అడుగుపెట్టేసరికి డోల్ఫస్ — కాంగ్రెసు హాలును తెరిచే ప్రయత్నంలో కాబోలు — తలుపుగుబ్బను (నాబ్‌ను) అందుకోబోతున్నాడు. చాలా కురచవాడేమో, తలుపుగుబ్బను అందుకోవాలంటే, అతడు చేతిని బాగా పైకి చాచవలసివచ్చింది. డోల్ఫస్ ఈ 'పాశ్చరు'లో వుండగా ప్లానెట్టా అతడిని చూచాడు. చూచీచూడ్డంతోటే ఆ నాజీ హంతకుడు ముందుకు లంఘించి, ఇరవై అంగుళాల దూరంలోనుంచి చంకలోకి కాల్చాడు. ఈదెబ్బకు డోల్ఫస్ ఒరిగిపోతూ వుండగా అతడు ఇంకోసారి— మరీ దగ్గరిలోంచి— ఎనిమిది అంగుళాలలోనుంచి— కాల్చాడు. ఈ రెండోదెబ్బకు డోల్ఫస్ నేల కూలిపోయాడు.

"రక్షించండి! రక్షించండి!!" అని డోల్ఫస్ తడబడుతూ అన్నాడు (హెల్ప్! హెల్ప్!!).

"లే! నిలబడు!!" అని ప్లానెట్టా గద్దించాడు.

"లేవలేను" అని గొడుగుడుపడుతున్న గొంతుతో డోల్ఫస్ జవాబిచ్చాడు.

అంతట కుట్రదారులు అతడిని లేవనెత్తి, ఆ గదిలోనే ఒక సోఫావుంటే, దానిమీద పడుకోబెట్టారు. గాయాలనుంచి రక్తం కాల్వలుకట్టి, ముందు సోఫాను తడిపి, తర్వాత కిందికి ప్రవహించసాగింది. ప్రవహిస్తున్న ఈ రక్తాన్ని పట్టడానికి ఆ నాజీ హంతకులు సోఫాకింద ఒక "బేసిన్" పెట్టారు.

సమీపంలోనే బందీలోవున్న మేజరుఫేకు తుపాకికాల్పుల మోత వినబడింది. అయితే, వాటి అర్థమేమిటో అతడికి తెలియ లేదు. ఇక తక్కిన బందీల సంగతి చెప్పనక్కర్లే లేదు. కుట్రదారులు ప్రభుత్వసైనికుల యూనిఫారంలో రావడాన్ని చూచి, ప్రభుత్వంవారే సోదాను జరిపిస్తున్నారేమో నని వారిలో కొందరు భ్రమపడ్డారు మరికొందరు మిలిటరీ డ్రిల్లు జరుగుతున్నదేమో నని అనుకున్నారు. ఇక, వారికి తుపాకికాల్పుల అర్థమేమిటో ఎలా తెలుస్తుంది?

తాను విన్న తుపాకికాల్పుల అర్థం ఏమిటా అని మేజరుఫే ఆందోళనపడుతూ వుండగా, రెండున్నర ప్రాంతాల కొందరు

నాజీలు వచ్చి, అతడిని డోల్ఫస్ మరణావస్థలో వున్న గది లోకి తీసుకువెళ్ళారు. అప్పటికే కొంత స్పృహ తప్పుతున్నప్పటికీ, డోల్ఫస్ అతడిని గుర్తుపట్ట గలిగాడు. గుర్తుపట్టి, హీన స్వరంతో ఇలా అన్నాడు:

"నేను చచ్చిపోతే, నా కుటుంబరక్షణ భారం నీవు వహించాలి."

కుట్రదారులు మేజర్ ఫే గుండెలకు రివాల్వర్‌ను గురి చేసి వుంచారు. "నీవు మాటాడితే, ప్రమాదంసుమా!" అని వాళ్ళు అతడిని బెదిరించారు.

"షూస్నిగ్ ఎక్కడ?"

"తెలియదు" అన్నట్టే ఫే తల వూపాడు. లేని వోపికను తెచ్చుకుని "రక్తపాతం జరగనివ్వకుండా దీన్ని పరిష్కరించుకోడానికి ప్రయత్నించండి. రీన్టెలెన్‌ను రాజీకి రమ్మనండి" అని డోల్ఫస్ తన అంత్యసందేశాన్ని తెలిపాడు.

కుట్రదారులు మేజర్ ఫేను గదిలోనుంచి బయటికి ఈడ్చుకు వెళ్ళారు. డాక్టర్ని పిలిపించండని మేజరు ఫే ముందు బ్రతిమలాడాడు. అందుకు అంగీకరించకపోతే, కనీసం "ప్రీస్టు" నైనా పిలిపించి, అవసానకాలంలో కాథొలిక్ క్రైస్తవుడికి జరగవలసిన తంతును జరిపించండని అతడు ప్రార్థేయపడ్డాడు. దీనికి కూడా కుట్రదారులు ఒప్పుదలకాలేదు!

తక్కినవారిలా డోల్ఫస్ కూడా తన సైనికులే తనమీద తిరగబడ్డారని భ్రమపడ్డాడు. ఇంతేకాదు, తిరుగుబాటు జయప్రదమైందనికూడా అతడు అనుకున్నాడు. మరి కాసేపటికి స్మృహ పూర్తిగా తప్పిపోతుందనగా అతడు తిరుగుబాటుచేసిన సైనికులు వెళ్ళిపోయారనీ, తనచుట్టూవున్నవారు తనపక్షాన వున్న సైనికులనీ భావించినట్టు తోస్తుంది. ఎంచేతనంటే గుంటలుపడిపోయిన కళ్ళతో కళావిహీనంగా చూస్తూ అతడు ఇలా గొణిగాడు: "కిందరు! (బిడ్డలారా!) మీరు నేనంటే ఇంత దయగా వున్నారు. తక్కినవారు మీలా వుండకపోవడానికి కారణ మేమిటి? నేను శాంతినే కోరాను. భగవంతుడు తక్కిన వారిని క్షమించా లని నా కోర్కె."

స్రవించి స్రవించి రక్తస్రవంతి ఆగిపోయింది. దానితో పాటు హృదయస్పందనకూడా నిలిచిపోయింది. మూడు—నలభై అయిదు గంటలకు డాక్టరు డోల్ఫస్ పరలోక గతుడైనాడు.

## 17

"డోల్ఫస్ రాజీనామా యిచ్చాడు; రిన్టెలెన్ ప్రభుత్వాధికారాన్ని స్వీకరించాడు."

కోలోవాట్‌రింగ్ దగ్గర బయలు దేరింది మొదలు ఈ అసత్య ప్రకటనలను చేయించడంవరకు మొదటిజట్టులోని నాజీ

కుట్రదారులకు సర్వమూ అనుకూలంగానే జరిగిందిగాని, ఇటు పైన తలవని తలంపుగా పరిస్థితులు ప్రతికూలమైనాయి. "టెలిఫోన్ గరల్" ఒకతె క్షణమాత్రం తరుణం లభించేసరికి, జరిగిన విషయాన్ని పోలీసు హెడ్ క్వార్టర్సుకు అతిధైర్యంగా తెలియపరచింది. ఇంతటి ధైర్యంతోనూ ఇంకొక వుద్యోగి బిసాంబర్గ్ కు — ఇది "సెండింగ్ స్టేషను — వెళ్ళే తీగల్ని తెగ నరికి వేశాడు. ఈ కారణాన తిరిగి ప్రకటన చెయ్యాలంటే నాజీలకు అవకాశం లేకుండా పోయింది. ప్రతిపదినిమిషాల కొకసారి "డోల్ఫస్ రాజీనామా యిచ్చాడు; రిన్ టెలెన్ ఛాన్సెలరు అయ్యాడు" అని ప్రకటించాలనీ, ఈ ప్రకటనలకు మధ్య వ్యవధిలో తిరుగుబాటును గురించి సలహాల్ని యివ్వడం, అబద్ధాల్ని చెప్పడం మొదలైన తతంగాన్ని నడపాలనీ వారు అనుకున్నారు. ఈ ఎత్తు సాగలేదు గాని, లేకపోతే గవర్న మెంటుకు ఎంతైనా అపకారం జరిగేది.

నాజీలు రావడం, ఇద్దరినిచంపడం, స్టూడియోలో దూర డం, "ఎనౌంసరు" మీద దౌర్జన్యాన్ని చెయ్యడం— దీన్ని అంతటనీ చూచి, తన బ్రాడ్ కాస్టు వుపన్యాసాన్ని రిహార్సల్ చేసుకుంటున్నవా డొకడు బెదరిపోయి, వెర్రిగా కేకలు వెయ్య సాగాడు. అతడిని నాజీలు కాల్చివేశారు. ఇంతలో హెడ్ క్వార్టర్సునుంచి పోలీసులు వచ్చిపడ్డారు. వారిమీద తిరుగు బాటుదారులు తుపాకుల్ని కాల్చారు. ఇందుమూలంగా ఒక

పోలీసువాడు చనిపోయాడు. తర్వాత తిరుగుబాటుదారులకూ, పోలీసువారికీ దాదాపు మూడుగంటలసేపు పోరాటం జరిగింది. ఈ పోరాటంలో పోలీసువారు మెషీన్‌గన్నులనూ, హ్యాండ్‌గ్రెనేడ్లనూ ఉపయోగించారుకూడా. చివరికి తమ నాయకుడు చచ్చిపోయిన తర్వాతనూ, తమలో కొందరు గాయపడినతర్వాతనూ, సాయంత్రం మూడున్నర ప్రాంతాలగాని కుట్రదారులు లొంగిరాలేదు.

రవాగ్ మీద నాజీలు జరిపిన యీదాడి మూలంగా మొత్తం అయిదుగురు మరణించారు. వారిలో ముగ్గురు సకాలంలో వైద్యసహాయం లేకపోవడంవల్ల నెత్తురు కాల్వలుకట్టి చచ్చిపోయినవారే!

ఇక, ఈలోపున ఛాన్సలరీదగ్గర జరిగిన సంఘటనలు ఇవి:

డోల్ఫస్ మంత్రివర్గం రాజీనామా యిచ్చిందనీ, రిన్‌టెలెన్ కొత్త మంత్రివర్గం యేర్పాటు చేశాడనీ రేడియో ద్వారా విన్న కొందరు జర్నలిస్టులు ఛాన్సలరీదగ్గరికి పరుగెత్తుకు వెళ్ళారు. వారు అక్కడికి వెళ్ళేసరికి, కొద్దిమందిజనంమాత్రం బైట వున్నారు; ఛాన్సలరీ తలుపులు వేసి వున్నాయి; లోపల ఏంజరిగిందీ, జరుగుతున్నదీ బయటివారికి కించిత్తైనా తెలియదు. అయితే ఆ చిన్నిగుంపులోవున్న ఒక జర్మన్ ఫోటోగ్రాఫర్‌కు— అతడు హెడగరి. యౌవనంలో వున్నాడు. ఆక్రితంనాడే బర్లిన్

నుంచి వియన్నా వచ్చాడు. అతడికి— సర్వం తెలుసునని చెప్పాలి. ఎంచేతనంటే,— తాను డోల్ఫస్ హత్యాదృశ్యాలను ఫోటో తియ్యడానికే ప్రత్యేకంగా వచ్చినట్టు, అతడు తన "ట్రైపాడ్" అనుకూలమైన స్థలంలో అమర్చుకోసాగాడు. తరువాత — ఒంటిగంట ఇరవై అయిదు నిమిషాలకు—మఫ్టీలో వున్న కొందరు గూఢచారులు, యూనిఫారాల్ని వేసుకొని, "స్టీల్ హెల్మెట్సు"ను (ఉక్కుతో చేసిన శిరోవేష్టాలను) పెట్టుకున్న అయిదుగురు పోలీసులు వచ్చారు. వారు రావడాన్ని చూచి, లోపలవున్న కుట్రదారులు అడుగు అంతస్థు కిటికీగుండా "వెళ్ళిపొండి; లేకపోతే కాల్చుతాము సుమా!" అని కేకపెట్టారు.

అటుపైన అయిదునిమిషాలకు—ఒంటిగంట యాభై అయిదు నిమిషాలకు— హైమ్‌వీరు లెఫ్టినెంటు వొకడు వొంటరిగానూ, నిరాయుధుడుగానూ వచ్చి, ఛాన్సలరీ తలుపును గట్టిగా తట్టి, "అయిదునిమిషాలలో తలుపు తెరిచి తీరాలి. అలా తెరవకపోతే, దాన్ని బద్దలగొట్టి, లోపల ప్రవేశిస్తాను" అని బెదిరించాడు. ఇంతవింతగా వచ్చి, ఇంతవింతగా బెదిరించి, చివరికి యింత వింతగానే అతడు సెలవుపుచ్చుకున్నాడు. అంతే! తిరిగి అతడి జాడైనా కనబడలేదు!!

ఆ తర్వాత మరికొందరు వుద్యోగులు రావడం, పోవడం జరిగింది; ఇప్పటికి కూడా లోపల జరిగిన అరెస్టుల సంగతి

గాని, హత్యసంగతి గాని బయటివారికి తెలియదు. ఇలా వుండగా రెండుగంటలఅయిదునిమిషాలకు "రైష్‌పోస్టు"— ఇది డోల్ఫస్ గవర్నమెంటు పత్రిక— ఎడిటరు డాక్టరు ఫండరు అక్కడికి వచ్చి "ఈ గొడవేమిటి?!" అని విచారించాడు. ఆయనకు యితరులెవ్వరూ జవాబివ్వలేకపోయారు గాని, బర్లిన్ నుంచి వచ్చిన ఫొటోగ్రాఫరు మాత్రం "రిన్‌టెలెన్ ఛాన్సలర్ అయ్యాడు. ఆస్ట్రియన్ లీజియన్ దండెత్తి వస్తున్నది. బర్లిన్‌నుంచి హాబిక్ట్‌కూడా ప్రయాణమై వస్తున్నాడు" అని చెప్పాడు. ఈ మాటల్ని వినేసరికి పరిస్థితులు విషమించినవని డాక్టరు ఫండరు గ్రహించాడు. కేవలం యిలా గ్రహించడమే కాదు— తన సత్వర కర్తవ్యమేమిటోకూడా ఆయన నిర్ణయించుకున్నాడు.

రిన్‌టెలెన్ ఏహోటలులో బసచేశాడో డాక్టరు ఫండరుకు తెలుసు. తిన్నగా ఆయన అక్కడికి వెళ్ళి, బెదిరించీ సదిరించీ, రిన్‌టెలెన్‌ను యుద్ధమంత్రికార్యాలయానికి వెంట పెట్టుకు వెళ్ళాడు. అక్కడ ప్రభుత్వోద్యోగులు అతడిని బందీని చేశారు.

ఈలోవుగా ప్రెసిడెంట్ మిక్లాస్‌కు, ఛాన్సలరీని నాజీలు ఆక్రమించుకోవడమూ, ఛాన్సలర్, వైస్‌ఛాన్సలర్, మొదలైనవారు బందీలు కావడమూ, డోల్ఫస్ గాయపడి మరణావస్థలోవున్న సంగతి— అప్పటికి ఇంకా ఎవ్వరికీ తెలియలేదు— తెలి

సింది. ఛాన్సలర్, వైస్‌ఛాన్సలర్ బందీ లై పోయినప్పుడు, ఇక ప్రభుత్వభారాన్ని వహించవలసింది తానేనని, గ్రహించి బందీలు కాకుండా వున్న మంత్రుల్ని టెలిఫోన్‌ద్వారా యుద్ధ కార్యాలయానికి వెంటనే పిలిపించి, వారితో ఆయన సమాలోచనలు ప్రారంభించాడు. ఈసమాలోచనలలో "బందీలోవున్న మంత్రులు జరిపే నిర్ణయాల్ని స్వీకరించడానికి వీలులేదు; కుట్రదారులు కోరిన షరతుల్ని మన్నించరాదు" అని ప్రెసిడెంట్ మిక్లాస్ స్పష్టంగా చెప్పాడు. ఆ తర్వాత ఆయన డాక్టరు షూష్నిగ్‌ను "ఇంటెరిం" (తాత్కాలికవు) ఛాన్సలరుగా నియమించి విద్రోహాన్ని చల్లార్చడానికీ, శాంతిని నెలకొల్పడానికీ, తిరుగుబాటుదారుల్ని శిక్షించడానికీ, బందీలైన మంత్రుల్ని వదిలించడానికీ, కావలసిన అధికారాల్ని అన్నింటినీ ఇచ్చాడు.

ఇక్కడ యుద్ధశాఖకార్యాలయంలో "ఇంటెరిం" మంత్రివర్గం సమావేశమై వుంటే, అక్కడ ఛాన్సలరీదగ్గర అంత్య సందేశాలమీాద అంత్యసందేశాల్ని పంపించడం ప్రారంభమైంది. రెండున్నరగంటలు అయ్యేసరికి అనేకమంది హైమ్‌వీర్ సైనికులు పోలీసులు వచ్చారు. రెండూ ముప్పయిఅయిదు నిమిషాలకు ఛాన్సలరీ తలుపును తట్టి "మీారు లొబడ్డానికి ఇరవై నిమిషాల గడువు యిస్తున్నాము. ఆతర్వాత అసలు భవనాన్నే నేలమట్టం చేస్తాము" అని అన్నారు. ఇందుకు 'వెళ్ళిపోతారా, లేక కాల్చమంటారా?' అని తలుపుగుండా కర్కశమైన గొంతుతో

జవాబు వచ్చింది. అందరుమంత్రులు బందీలైనారనే భయం ఈ సమయానికి ఛాన్సలరీ బయట చేరినవారిలో వ్యాపించింది.

మూడుగంటలకు మేజరుబార్ — ఇతడు హైమ్‌వీర్ ఆఫీసర్. లోయర్ ఆస్ట్రియా గవర్నర్ — వచ్చాడు. పోలీసు వుద్యోగివొకడు మేజరుబారు దగ్గరికి వెళ్ళి 'ఏమిచెయ్యాలో నాకు పాలుపోవడంలేదు. మాతోడ్పాటుకోసం మరికొన్ని దళాలు, పై అధికారుల వుత్తరవులు వస్తాయేమోనని యెదురు చూస్తున్నాను' అని అన్నాడు. ఈసరికి చాలామంది హైమ్ వీరు సైనికులు బర్గథియేటరు వైపుకు వెళ్ళేరోడ్డువెంట బారులుతీరి నిలబడ్డారు. వారు ఛాన్సలరీపైకి వురకాలని యత్నించారుకాని, పోలీసులు వారిని వెనక్కు తోసివేశారు. ఇంతలో ఎవరో మేజరుబారును సమీపించి "లోపల ఎవరున్నారు?" అని అడిగారు.

"డోల్ఫస్, ఫే, కార్విన్‌స్కీ: వీరు ముగ్గురు కుట్రదారులకు బందీలైపోయి, లోపలచిక్కుపడ్డారు. అప్పుడువేరొక కొత్తమంత్రివర్గం ఏర్పడింది. అది యుద్ధకార్యాలయంలో సమావేశమై కర్తవ్యాన్ని ఆలోచిస్తున్నది." అని అతడు జవాబిచ్చాడు. ఈజవాబుతో అందరు మంత్రులు బందీలయ్యారనే భయం తొలగిపోయింది.

మూడూయాభై యేడునిమిషాలకు మేజర్ బార్ బాల్కనీలోకి వచ్చాడు. గండ్రగొడ్డలిలావుండే అతని ముఖంలో

కత్తివాటు వేసినా నెత్తురుచుక్క లేనట్లుంది. అతడి వెంట కుట్ర దారుల నాయకుడు—హార్జ్ వెబ్బర్—వున్నాడు. హార్జ్ వెబ్బరు, పిట్టఅంతటి మనిషి అతడు కళ్ళజోడు పెట్టుకున్నాడు. తళతళ మెరిసే మెడల్సుతోవున్న కెప్టెన్ యూనిఫారాన్ని వేసుకు న్నాడు ఇలాంటి యూనిఫారంలో వున్నప్పటికీ. అతడు తాలూకా ఆఫీసులో గుమాస్తాలానే కనవస్తాడు. మేజరుఫేను చూచేసరికి, జనం ఒక్కసారిగా గొల్లున కేకలు పెట్టసాగారు. దాన్నిచూచి అతడు 'సైలెన్స' అని లోగొంతుతో అన్నాడు.

ఈ మాటను వినేసరికి "సైన్యంతో కలిసి, మేజరు ఫే యీ తిరుగుబాటును చేశాడు" అని అందరికీ ఒక్కసారి తోచింది. "కమాన్‌డెంట్ ఎక్కడ?" అని ఫే అడిగాడు. అతడికోసం వెదికితే, అతడు కనబడలేదు. అప్పుడు ఒక పోలీసు వుద్యోగి నాలుగడుగులు ముందుకు వెళ్ళి, వినయ పూర్వకంగా "సెల్యూట్" చేశాడు. "నీవు ఎవరివి?" అని ఫే అడిగాడు. "నాపేరు కెప్టెన్ వెబ్బరు. వుత్తరువుల కోసం ఎదురు చూస్తున్నాను" అని ఆ పోలీసు వుద్యోగి బదులు చెప్పాడు. అప్పుడు హార్జ్ వెబ్బరు, మేజరు ఫే దగ్గరికి జరిగి చెవిలో యేమో చెప్పాడు. తర్వాత మేజరు ఫే "ఆయుధాలు ఏవీ వెంటలేకుండా దొడ్డిగుమ్మందగ్గరికి రా!" అని అన్నాడు. "సరే" అన్నట్టు వెబ్బరు తలవూపి, బయ ల్దేరాడు. "ఆయుధాలు లేకుండా వొంటరిగా రా! లేక

పోతే, తర్వాత విచారపడతావుసుమా!" అని అతడిని హోల్జ్ వెబ్బరు హెచ్చరించాడు.

స్క్వేరులోవున్న హైమ్‌వీరు సైనికులు మేజరుఫేను గుర్తించి "ఫే! మా మేజరు ఫే!" అని అరవడం సాగించారు.

నాలుగూ ఎనిమిది నిమిషాలకు వెబ్బరు దొడ్డి వాకిటిలో నుంచి తిరిగి వచ్చాడు. కాలికొద్దీ పరిగెత్తుకురావడంలో అతడి హెల్‌మెట్ పడిపోయింది. జుట్టు చిందరవందర పడింది. ముచ్చెమటలు పోసినవి. వచ్చీరావడంతోటే అతడు పోలీసు హెడ్ క్వార్టర్సుకు ఇలా ఫోను చేశాడు.

"నేను లోపలికి వెళ్ళి మేజరుఫేతో మాట్లాడివచ్చాను. డోల్ఫస్ తీవ్రంగా గాయపడ్డట్టు తోస్తుంది. ఆయన రాజీనామా పెట్టాడు. కొత్తమంత్రివర్గం ఏర్పడింది. ఈ కొత్తమంత్రివర్గంలోకూడా మేజరు ఫే వైస్‌ఛాన్సలరు అయ్యాడు." హెడ్‌క్వార్టర్సువారు ఏమో అడిగితే వెబ్బరు తిరిగి ఇలా చెప్పాడు:

"వాళ్ళు మిలటరీ వాళ్ళుగా కనపడుతున్నారు. ఛాన్సలరీ వుద్యోగులు—నూటయాభయిమంది—స్త్రీలూ, పురుషులూ కూడా—పెరటిలో బందీలై యున్నారు."

ఈనరికి కమేండెంట్ — హోస్‌రాట్ హాంపెల్ — చేరుకున్నాడు. అతడు వెబ్బరును పిలిచి, "ఛాన్సలరు గాయపడి వుంటే, ఆయనకోసం డాక్టరు అవసరం గదా! దొడ్డివాకిలి

దగ్గరికి పరుగెత్తుకు వెళ్ళి, డాక్టర్ని పంపిస్తామని చెప్పిరా!" అని అన్నాడు. వెబ్బరు వెళ్ళివచ్చి, "నేను తలుపుతట్టి అడిగితే, మరి డాక్టరుతో అవసరం లేదని సెంట్రీ జవాబు చెప్పాడు" అని తెలియజేశాడు. దానితో డోల్ఫుస్ మరణించాడన్న సంగతి బయటవున్న వారికి తెలిసింది.

నాలుగు ఇరవై నిమిషాలకు మేజరు ఫే తిరిగి బాల్కనీలోకి వచ్చాడు. అతడివెనక యీసారికూడా హోల్జ్ వెబ్బరు తయారయాడు. హోల్జ్ వెబ్బరు తిరిగి వెంటరావడమూ, తిరిగి ఏవో ఉత్తరువులను యిస్తున్నట్టు కనబడ్డమూ చూచి, మేజరుఫే తిరుగుబాటులో లేడన్న సంగతిని జనం తెలుసుకున్నారు. బాల్కనీలోనుంచి మేజరుఫే దొడ్డిగుమ్మంవైపుకు రావలసిందని హాంపెల్‌కు సంజ్ఞచేశాడు. సుమారు ఇరవై నిమిషాల తర్వాత హాంపెల్ దొడ్డివాకిలినుంచి తిరిగివచ్చి "రిణ్టెలెన్ ఛాన్సలరు అయ్యాడు. ఫే వైస్‌ఛాన్సలరు. రిణ్టెలెన్‌కోసం వాళ్ళు ఎదురుచూస్తున్నారు. ఆయన అయిదారు నిమిషాలలో వస్తారు" అని ప్రకటించాడు.

అలాగే అయిదారు నిమిషాలతర్వాత ఒకవ్యక్తివచ్చాడు. అయితే, అతడు రిణ్టెలెన్ కాదు,—డోల్ఫుస్ మంత్రివర్గంలో వాడైన న్యూస్టాడ్‌టర్ – స్టర్మరు. యుద్ధమంత్రి కార్యాలయంలో జరిగిన మంత్రివర్గ సమావేశంలోనుంచి నరాసరి అతడు ఛాన్సలరికి వచ్చాడు.

తర్వాత కొన్ని నిమిషాలకు మేజర్ ఫే మూడోసారి బాల్కనీలోకి వచ్చి "రిన్‌టెలెన్ ఎక్కడ?" అని అడిగాడు.

వీధిలో నిలబడి వున్న న్యూస్టాడ్టర్ – స్టర్మర్ "రిన్‌టెలెన్ రావడంలేదు" అని బదులు చెప్పాడు.

ఈ జవాబుకు విస్తుపోతూ, మేజరు ఫే, హోల్జ్ వెబ్బరు వైపుకు తిరిగి ఏమో అడగబోయాడు. ఇంతలో హైమ్‌వీరు దళానికి చెందినవాడొకడు "భవనాన్ని ముట్టడించమా?" అని కేకవేశాడు.

"వద్దు! నావుత్తరువు లేనిదే, ఏమీ చెయ్యకద్దు!" అని ఫే గద్దించాడు

ఇందుకు న్యూస్టాడ్టర్ – స్టర్మరు "కొత్త ప్రభుత్వం ఏర్పాటయింది. దానికి నేను ప్రతినిధిని. ప్రభుత్వం తరఫున తిరుగుబాటుదారుల్ని సురక్షితంగా దేశంవెలుపల విడిచిపెడతామని నేను మాట యిస్తున్నాను. వాళ్ళను జర్మనీ సరిహద్దులలో విడిచిపెట్టే పూచీ నాది. ఇంకొక ఇరవై నిమిషాలలో లోబడక పోతే, మేము భవనాన్ని ముట్టడిస్తాము" అని బదులు చెప్పాడు.

ఈ జవాబును విని మేజరు ఫే "మీరు భవనాన్ని ముట్టడించడానికి వీలులేదు. నేను ప్రజాశాంతి రక్షణ మంత్రిని. నా అనుజ్ఞలేనిదే మీరు ఏమీ చర్య జరపరాదు" అని అరిచాడు.

అప్పుడు, న్యూస్టాడ్ టర్ - స్ట్రర్మర్ తల పైకెత్తి, తీక్ష్ణంగా చూస్తూ, "మీరు పొరపడుతున్నారు. బందీలో వున్న మంత్రులనిర్ణయాల్ని పాలించవద్దని కొత్తప్రభుత్వం తీర్మానించింది. ఇప్పుడు అయిదు ఇరవై ఎనిమిది నిమిషాలైంది. అయిదు నలభై ఎనిమిది నిమిషాలకు భవనాన్ని ముట్టడిస్తాము" అని నిష్కర్షగా చెప్పాడు.

సరిగా అయిదు నలభై ఎనిమిది అయ్యేసరికి ఇక ముట్టడి ప్రారంభమౌతుందేమో నని అనుకుంటే, ఏమీ జరగలేదు. మేజర్ ఫే బాల్కనీలో నుంచి లోపలికి వెళ్ళిపోయాడు. న్యూస్టాడ్ టర్ — స్ట్రర్మర్ బోనులోని సింహంలా ఇటూ అటూ తిరుగుతూ వున్నాడు. "ఆస్ట్రియావారి అత్యానందేశమేఇది!" అని కొందరు విదేశీయులు పరిహసించారు. అయితే ఏ క్షణాన పరిస్థితులు ఎలా పరిణమిస్తాయో అనే ఆందోళన మాత్రం అందరి ముఖాలలోనూ వ్యక్తమైంది. ఆరుగంటల నాలుగునిమిషాలకు ఫే తిరిగి బయటికి వచ్చి, తిరుగుబాటుదార్లు లొబడ్డానికి అంగీకరించారనీ, కాని సురక్షితంగా తమను దేశం వెలుపలికి పంపించే విషయంలో ఏమి గ్యారంటీ యిస్తారని అడుగుతున్నారనీ, చెప్పాడు. వాళ్ళు మిలటరీ బందోబస్తు కోరారు. "దాన్ని ఏర్పాటు చెయ్యగలం" అని న్యూస్టాడ్ టర్ - స్ట్రర్మరు బదులుచెప్పాడు. "అయితే, మరి పదిహేనునిమిషాల వ్యవధి నిస్తారా?" అని హాడిక్ తో — ఇతడు కుట్రదారులలోని వాడు— సంప్రదించి మేజరు ఫే అడిగాడు.

ఆరున్నరకు ఫే ఇంకొకసారి బాల్కనీలోకి వచ్చాడు. ఈమధ్యలో అక్కడికి చేరుకుని నాయకత్వాన్ని వహించిన, జనరల్ జెహానర్‌తో — ఈయన యుద్ధశాఖకు సహాయమంత్రి — అతడు యేమో మాటాడబోయాడు. అయితే, అక్కడ గల భాలో వొకరికీ వినబడలేదు. అంచేత జెహానర్, న్యూస్టాడ్‌టర్ — స్ట్రర్మర్: వీరిద్దరు దొడ్డిగుమ్మంవైపుకు వెళ్ళారు. వారు ఇలా వెళ్ళిన కాసేపటికి వియన్నాలోని జర్మన్ రాయబారి డాక్టర్ రీత్ అక్కడికి వచ్చాడు. ఇతడు వచ్చింది కుట్రదారుల్ని సురక్షితంగా సరిహద్దువరకూ పంపుతామన్న వాగ్దానానికి సాక్షిగా వుండడానికి. తర్వాత షుమారు ఆరు యాభై నిమిషాలకు జనరల్ జెహానర్ తిరిగివచ్చి "స్టాఫ్ ఆఫీసర్" నాయకత్వంకింద మిలటరీ బందోబస్తు జరిపి, వాళ్ళను సురక్షితంగా పంపించడానికి అంగీకరించాము అని ప్రకటించాడు.

ఏడున్నర గంటల ప్రాంతాల మేజర్ ఫే దొడ్డి గుమ్మంగుండా బయటికి వచ్చివేశాడు. అతడు న్యూస్టాడ్‌టర్ — స్ట్రర్మరు దగ్గరికి వెళ్ళి "ఒకసిగరెట్ ఇవ్వండి" అని అడిగాడు. సిగరెట్ ఇస్తూ "డోల్ఫస్ చనిపోయినమాట నిజమేనా?" అని న్యూస్టాడ్‌టర్ — స్ట్రర్మర్ అడిగాడు.

"ఔను! చనిపోవడానికి ముందు, ఆయనతో నేను మాట్లాడినాను. నేను వెళ్ళినప్పుడు రక్తం కాల్వలు గడుతున్న గాయాలతో ఆయన సోఫామీద పడివున్నాడు" అని మేజర్

ఫే జవాబు చెవుతూ విచారోద్వేగంతో చేతిలోని సిగరెట్‌ను నలిపి వేశాడు. తర్వాత "ఏదీ, ఇంకొక సిగరెట్ ఇవ్వండి" అని అడిగాడు.

ఏడు యాభై నిమిషాలకు డాక్టర్ రీత్, కార్విన్‌స్కీ బయటికి వచ్చారు. ఈనరికి కొత్త ఛాన్సలర్ డాక్టరు షూష్నిగ్ కూడా అక్కడికి చేరుకున్నాడు.

తరువాత షూష్నిగ్, జెహ్నర్, న్యూస్టాడ్‌టర్-స్ట్రర్మర్ ఈనలుగురు మంత్రిలు పక్కనున్న తోటలోకి వెళ్ళి అక్కడ పచ్చికతిన్నెమీద నిలబడి "కాబినెట్ మీటింగు" (మంత్రి వర్గ సమావేశం) జరిపారు. ఈ లోవుగా ఇరవై మిలటరీ లారీలు వచ్చి బైట నిలబడ్డాయి; తిరుగుబాటుదారుల్ని అరెస్టుచేసి లారీలలో యెక్కించడానికి పోలీసులు ఛాన్సలరీలో ప్రవే శించారు.

'సురక్షితంగా మేము జర్మనీపోతున్నాము; మా కేమి?' అన్నట్టు ఆ నాజీకుట్రదారులు—ఆ హంతకులు—— పొగరబోతు తనంగా బయటికి వచ్చారు.

## 18

ఛాన్సలరీ దగ్గర నాజీలను ఎక్కించుకుని బయల్దేరిన మిలిటరీ లారీలు జర్మనీ సరిహద్దును చేరలేదు,— ఛాన్సలరీకి మైలు దూరంలోవుగా వున్న మరో కన్నర్ పోలీసు బేరక్స

దగ్గిరికి వెళ్ళి ఆగాయి. "సురక్షితంగా మిమ్మల్ని జర్మనీ సరిహద్దుదగ్గర వదిలి పెడతా మని మాట యిచ్చి, ఇలా చెయ్యడం తప్పు కాదా?" అని అడగడానికి వీలున్నది. "ఇది తప్పు కా"దని ఆస్ట్రియా ప్రభుత్వంవారుకూడా అనలేదు. అయితే, వారు తమ నడవడిని సమర్థించుకోడానికి రెండు కారణాలను చెప్పారు. బందీలో వున్న మంత్రుల నిర్ణయాలను అంగీకరించమని ఇంటెరిం మంత్రివర్గం తీర్మానించింది. ఈతీర్మానం ప్రకారం తిరుగుబాటుదారులకు అభయ మివ్వడానికి మేజర్ ఫే కు అధికారంలేదు. ఇది మొదటి కారణం. ఎవ్వరికీ ప్రాణాపాయం కలిగివుండని పక్షంలోనే తిరుగుబాటుదారులకు అభయ మివ్వవచ్చునని సాయంత్రి అయిదు గంటలకు ఇంటెరిం మంత్రివర్గం నిర్ణయించింది ఈ నిర్ణయం సంగతి తెలియక న్యూస్టాడ్ టర్-స్ట్రర్మర్ అభయ మిచ్చాడు గనక, దాన్ని పాటించవలసిన పని లేదు. ఇది రెండో కారణం. నిజానికి ఈ రెండు కారణాలు లోకం కోసం తర్వాత ఆలోచించినట్టివి ఇక, అసలు కారణమేమంటే, డోల్ఫస్ హత్యను గురించిన ఘాతుకమైనవివరాల్ని వినగానే డాక్టరు షూష్నిగ్ "ఈ హంతకుల్ని వదిలి పెట్టడానికి వీలు లేదు". అని నిర్ణయించాడు. ఇదే భావాన్ని హోర్జ్ వెబ్బర్ విచారణసందర్భంలో న్యూస్టాడ్ టరు-స్ట్రర్మరు కిందివిధంగా వెల్లడించాడు; "ఔను, సైనికుడిలా నేను వాగ్దానాన్ని చేసినమాట నిజం. అయితే సైనికుడు చేసే వాగ్దానాలు ఇతర సైనికులకు వర్తిస్తవి గాని, ప్రాణోపద్రవకరంగా గాయపడి వున్న వ్యక్తికి

వైద్యసహాయాన్ని, అంత్యకర్మల్ని నిరాకరించే అధమాధము లను కాదు.''

డోల్ఫస్ హత్యలో పాల్గొన్న నాజీలు నిజంగా అధమాధములే! వారు ఛాన్సరీలలోని డ్రాయర్లను తెరిచి, బంగారపు గడియారాల్ని కాజేశారు. ప్రెసిడెంట్ మిక్లాస్ బీరువాను పగల గొట్టి పదహారు స్కిల్లింగ్సును—ఇవి ఆస్ట్రియన్ నాణ్యాలు—దొంగిలించారు. చచ్చి పడివున్న డాక్టర్ డోల్ఫస్ జేబులో నుంచి మనీపర్సును కొట్టివేశారు. వారికి నిజంగా రాజకీయాదర్శాలువుంటే, ఆ ఆదర్శాలకోసమే వారు విద్రోహాన్ని జరిపివుంటే, ఇంత హీనంగా—ఇంత నీచంగా—ఇంత అసహ్యకరంగా ప్రవర్తించి వుంటారా? వారు విద్రోహులు కారు,—చోరులు, హంతకులు, మానవాధములు!

తిరుగుబాటుదారులలో పదమూడుమందిని ఉరితీశారు. హోల్జ వెబ్బరు, ప్లానెట్ట్, ముగ్గురు పోలీసువాళ్ళు: ఉరి వద్దవారిలో వీరుకూడా వున్నారు.

తర్వాత ఏడు మాసాలకు రిన్‌టెలెన్ కేసు విచారణకు వచ్చింది. దేశద్రోహ నేరానికిగాను అతడికి ఆజన్మ కారాగార వాస శిక్ష పడింది. అయితే, అతడు ఎంతోకాలంపాటు కారాగారంలో వుండలేదు. కొన్ని నెలలలోనే అతడి ఆరోగ్యం శిథిలమైంది. అప్పుడతడిని పోలీసు కాపుదలతో ఆదేదో శానిటోరియంకు పంపించారు.

ఛాన్సలరు పదవిని ఆశించడం! చివరికి శానిటోరియం గతిత్తకావడం! సాధారణంగా దేశద్రోహుల బ్రతుకు చివరికి ఇలాగే అవుతుంది!!

## 19

ఛాన్సలరును హత్య చేశారు; వైస్ ఛాన్సలరును ఖైదుచేశారు; చాన్సలరీని ఆక్రమించుకున్నారు. అయినప్పటికీ నాజీల కుట్ర కొనసాగలేదు; వారి విద్రోహం విజయవంతం కాలేదు. ఇది ఆశ్చర్యకరమైన విషయమే! అయితే ఇందుకుతగిన కారణాలు లేకపోలేదు.

మొదటి కారణం: ఛాన్సలరీ ఆక్రమణకు నాయకత్వం వహించడానికి నియమితుడైన వ్యక్తి — ఇతడి పేరు కుంజ్. ఇతడు లాయరు — తీరా ఆక్రమణ చెయ్యడానికి బయల్దేరిన తర్వాత గుండె చెదిరి, కాలికి బుద్ధి చెప్పడం. జీబెన్‌స్టెర్న్‌గాస్ భవనంనుంచి ఛాన్సలరీకి బయల్దేరిన మూడు ట్రక్కులలో మొదటిదానికి లీడరు — హోల్జ్ వెబ్బరు. రెండోదానికి లీడరు — హాడిల్. ఇక మూడోదానికి కుంజ్ లీడరుగా వచ్చి, ఛాన్సలరీ ఆక్రమణకూ, ఆపై కార్యకలాపాలకూ బాధ్యత వహించవలసింది. మార్గమధ్యంలో తప్పుకువెళ్ళాడో, లేక మొదటిలోనే వుండాయించాడో తెలియదుగాని, ఇతడు చాన్సలరీకి చేరనే లేదు. తమనాయకుడు కుంజ్ రాలేదు గదా అని తక్కిన కుట్ర

దారులు వెనుదీయక, ఛాన్సలరీని ఆక్రమించుకున్నారు. 'ముందు ఆక్రమణ మనం సాగిస్తే, ఆతర్వాత వ్యవహారాన్ని నడపడానికి రిన్టెలెన్ వస్తాడుగదా!'' అని వారు అనుకున్నారు. కాని, వారు అనుకున్నట్టు రిన్టెలెన్ కూడా రాలేదు. అప్పుడు ఏమి చెయ్యడానికీ తోచక వారు కుంజ్ బసచేసిన హోటెల్‌కు ఫోన్ చేశారు. అయితే ఆ వీరశిఖామణి అప్పటి గప్పటికే జర్మనీకి పలాయనాన్ని చిత్తగిస్తున్నాడు!

రెండో కారణం: ఛాన్సలరీ ఆక్రమణ జరిగిన వెంటనే — డోల్ఫస్ హత్య అయిపోయాడని విన్న వెంటనే— ప్రభుత్వాధికారాన్ని పరిగ్రహించవలసిన రిన్టెలెన్ వట్టి "ఫూల్" లా ప్రవర్తించడం. ఒకటి యాభై అయిదు నిమిషాలకు రవాగ్ నుంచి "మీరు ఛాన్సలరు అయ్యారనడం సర్వాబద్ధమని ప్రకటించండి" అంటూ "ఫోన్ మెసేజ్‌" వచ్చింది. "అలా ప్రకటించడానికి నాకు అధికారం లేదు" అని జవాబు చెబుతూ, అతడు "రిసీవరు" పెట్టివేశాడు. ఇలా చేసినవాడు పోనీ ఆతర్వాతనైనా రంగంలోకి దిగి, ప్రభుత్వాధికారాన్ని చేజిక్కించుకోడానికి యత్నించాడా అంటే, అదీ లేదు. కేవలం చేతుల్ని వొడిలో పెట్టుకు కూర్చుని డాక్టరు ఫండరు రాగానే ఆయనవెంట పడి వెళ్ళి, బందీ అయ్యాడు. పగలు చేసిన ఈ అవకతవకలు చాలవన్నట్టు, ఆ రాత్రికి రివాల్వరుతో కాల్చుకున్నాడు. చివరికి ఈపనిలో కూడా అతడు తెలివితక్కు

వనే బయట పెట్టుకున్నాడు. ఆత్మహత్య చేసుకోడానికి ప్రయ త్నించడం, ఆ ప్రయత్నంలో కూడా నెగ్గకపోవడం— ఇది తెలివి తక్కువ కాదూ?

రిన్‌టెలెన్ ఈ వింతనడవడికి కొందరు ఒక కారణాన్ని చెబుతారు. అది ఇది: డోల్ఫస్ మీద తిరుగుబాటు చెయ్యాలని రిన్‌టెలెన్ వియన్నాకు వచ్చినమాట నిజం. ఆ తిరుగుబాటు జులై 25వ తేదీ నాడు జరగడానికి అతడు ఏర్పాట్లు జరిపిన మాట కూడా నిజం. అయితే ఆనాడు జరిగిన తిరుగు బాటు రిన్‌టెలెన్ ఏర్పాటు చేసిందీ కాదు; దానిలో పాల్గొన్న వారు రిన్‌టెలెన్ మనుష్యులూ కారు. హాబీక్ట్‌కు— పూర్వం చెప్పినట్టు, ఇతడు జర్మనీకి పలాయనమైన ఆస్ట్రియన్ నాజీ నాయకుడు— రిన్‌టెలెన్ అంటే చాలా అనూయ; ఎంతో అవిశ్వాసం. రాజ్యాధికారం ముందు రిన్‌టెలెన్ హస్తగతమై పోతె, ఆతర్వాత అది నాజీలకు సంక్రమిస్తుందో, లేదో అని అతడికి భయం కూడా! అంచేత రిన్‌టెలెన్ తిరుగుబాటు జరిపింప దలచిన జులై 25 వ తేదీనాడే హాబీక్ట్ కూడా విడిగా ఇంకొక తిరుగుబాటును చేయించాడు. ఇందువల్ల జరు గుతున్న తిరుగుబాటు తమదో, కాదో తేల్చుకోలేక రిన్‌టెలెన్ తికమక పడ్డాడు.

ఇక, మూడో కారణం: దేశం మొత్తంమీద తిరుగు బాటు జరగకపోవడం. వియన్నానుంచి "సిగ్నల్" ఇవ్వగానే

దేశం అంతటిలోనూ విద్రోహజ్వాలలు ప్రజ్వలిస్తాయని నాజీలు ఆశపడ్డారు. కాని ఇలా జరగలేదు స్టైరియా, కారిన్థియా: ఈ రెండు రాష్ట్రాలలో మాత్రమే తిరుగుబాటు జరిగింది. రెండు రోజులపాటులో, ప్రభుత్వం దీన్ని అణిచివేసి, శాంతిని నెలకొల్పింది

వైఫల్యకారణం: జర్మనీనుంచి సైనిక సహాయం రాక పోవడం. తాము విద్రోహాన్ని ప్రారంభించడమే తడవుగా జర్మనీనుంచి "ఆస్ట్రియన్ లీజియన్" తమసహాయానికి వస్తుందని ఆస్ట్రియన్ నాజీలు కొండంత ఆశ పెట్టుకున్నారు ఈ ఆశ కేవలం అడియాస అయిపోయింది సంవత్సరన్నర పాటు "మీరు తిరుగుబాటు చెయ్యండి; మీ వెనక నేనున్నాను" అని దుర్బోధ చేసిన హిట్లర్, తీరా తాను తోడ్పడవలసిన అవసరం వచ్చేసరికి — కొంచెం ముతకగా చెప్పాలంటే— తోక ముడతపెట్టాడు. ఆస్ట్రియన్ సైన్యం విద్రోహంలో చేరు తుందని అనుకుంటే, అది జరగలేదు. పోనీ, ప్రజలైనా విద్రోహం పట్ల వుత్సాహాన్ని కనపరుస్తారేమో అని ఆశిస్తే అదీ సంభవించలేదు. ఇందుకు తోడు "ఆస్ట్రియాలో నాజీ తిరుగు బాటును ఏమైనాసరే నెగ్గనివ్వను" అనే పట్టుదలతో ముసోలినీ తన సైన్యాలను బ్రెన్నరు కనుమదగ్గర ఆయత్తపరిచాడు. ఆస్ట్రియా జర్మనీ వశం కావడంవల్ల ఇటలీకి కలిగే అనర్థకాల మాట అలా వుండగా, డాల్ఫుస్ ముసోలినీ మిత్రుడు.

మిత్రుడు హత్యను ఇటాలియన్ డిక్టేటర్ సహించగలడా? ఇందుకు తోడు సరిగా డోల్ఫుస్‌ను నాజీలు హత్యచేసిన వేళకు డోల్ఫుస్ ఆలుబిడ్డలు ముసోలినీ అతిథులుగా అతడి యింటిలో వున్నారు. అంచేత ముసోలినీ కోపానికి మరీ మితిలేకుండా పోయింది. "జర్మన్ సైన్యాలు ఆస్ట్రియాలోకి అడుగుపెడితే, నేను నా సైన్యాలనుకూడా ఆస్ట్రియాలోకి నడుపుతాను" అని అతడు అన్నాడు. దాన్ని చూచి చల్లగా తప్పుకోవడమే ఉత్తమమని అనుకున్నాడు హిట్లర్. తర్వాత అతడు తన చాల లేనితనానికి తానే సిగ్గుపడి, ఈసిగ్గు కోపం కాగా, "ఆస్ట్రియన్ లీజియన్"ను రద్దు చేశాడు; హాబీష్ట్‌ను బర్తరఫ్ చేశాడు; ఇక అతడు ఫ్రాన్‌ఫెల్డ్‌ను ఏమి చేశాడో తెలియదు గాని,— ఆ ఆస్ట్రియన్ నాజీనాయకుడు అదృశ్యుడయ్యాడు.

పోతే, చివరకారణం ఇది: ఆస్ట్రియా ప్రెసిడెంట్ విల్‌హెర్మ్ మిక్లాస్ అదునుకు అవసరమైన ధైర్యసాహసాలను ప్రదర్శించడం. ప్రెసిడెంట్ మిక్లాస్ అంత పొడగరి కాడు; బొత్తిగా పొట్టివాడు కూడా కాదు. కాయంమాత్రం స్థూలమైనదే. మెల్లకళ్ళు. ఆకారాన్నిబట్టి చూస్తే, ఆయన రాజకీయ ప్రముఖు డని గాని, శక్తిసంపన్ను డని గాని, అనుకోవడానికి వీలే లేదు. ఆయన బడిపంతుళ్ళ కుటుంబంలో పుట్టాడు; తను కూడా కొంతకాలం పాటు బడిపంతులుగా పని చేశాడు. రోమన్ కాథొలిక్ మతం అంటే, ఆయనకు విపరీతమైన అభి

మానం. యువకుడుగా వుండగానే క్రిస్టియన్ సోషల్ పార్టీ అభ్యర్థిగా, ఆయన ఆస్ట్రియన్ పార్లమెంటుకు సభ్యుడుగా ఎన్నిక అయ్యాడు. తర్వాత అనతికాలంలోనే తన నిష్పక్షపాత బుద్ధివల్లనేమి, తన ఋజువర్తనం వల్లనేమి, ఆయన అందరి గౌరవానికీ పాత్రుడై, ఆస్ట్రియన్ కామన్సు సభకు స్పీకర్ అయ్యాడు. ఈ పదవినుంచి ఛాన్సలర్ సైపెల్ సహాయంతో 1928 డిశంబరులో ఆస్ట్రియన్ రిపబ్లిక్ ప్రెసిడెంట్ పదవికి వచ్చాడు. 1934 ఫిబ్రవరి నాటి అంతర్యుద్ధ సందర్భంలో జోక్యం కలగ జేసుకోకుండా వుండి, నిర్బలత్వాన్ని ప్రదర్శించి దేశానికి అపకారం జరగనిచ్చాడు. ఇందుకు పశ్చాత్తాప పడి కాబోలు, నాజీలు విద్రోహాన్ని జరిపినప్పుడు ఆయన ప్రశంసనీయమైన ధైర్యసాహసాలతో ప్రవర్తించాడు.

అసలు ప్రెసిడెంట్ మిక్లాస్ కూడా నాజీ హంతకులకు బలి కావలిసిందేగాని, కొద్దిలో గండం తప్పిపోయింది. డోల్ఫస్ హత్య అయిననాటికి ఒక రోజుముందు క్లాగెన్‌ఫర్ట్ పోలీసువారు వెల్డెన్‌లో వేసంగి సెలవుల్ని గడుపుతున్న మిక్లాస్‌ను హత్య చెయ్యడానికి కొందరు నాజీలు వెడుతున్నారని నమ్మకస్థులద్వారా తెలుసుకుని, వారి మోటారుకారును దారిలో ఆపివేశారు. ఈ మోటారుకారులోని వారిలో వొకడు అంతకు మూడురోజుల క్రితంనాడు మాత్రమే బర్లిన్‌నుంచి వచ్చినవాడు!

కారణాలు ఏమైతేనేమి గాని, 1934 జులై 25వ తేదీ నాటి నాజీ విద్రోహం నెగ్గలేదు; అప్పటిలో ఆస్ట్రియాకు హిట్లర్ దాస్యబాధ తప్పింది.

## 20

డాక్టరు కర్ట్‌వాన్ షూష్నిగ్ జననం 1897 లో. అతడి జన్మస్థానం ఇటలీలోనే గార్డా సరస్సు ప్రాంతం. షూష్నిగ్ జనన కాలంనాటికి ఈ ప్రాంతం ఆస్ట్రియా సరిహద్దులలోనే వుండేది.

1915 లో అతడు ఆస్ట్రియా సైన్యంలో వాలంటీరుగా చేరి, ఐరోపా మహాసంగ్రామంలో పాల్గొన్నాడు. అప్పటికతడి వయస్సు పద్దెనిమిది సంవత్సరాలు. రెండు సంవత్సరాలపాటు యుద్ధం చేసినతర్వాత 1919 లో అతడిని ఇటాలియనులు ఖైదీగా పట్టుకున్నారు. అప్పటినుంచి యుద్ధం పూర్తి అయ్యే వరకు అతడు ఇటాలియనుల "ప్రిజన్ క్యాంపు" లో వుండవలసి వచ్చింది.

షూష్నిగ్ తండ్రి జనరల్‌గా పనిచేస్తూ వుండేవాడు. షూష్నిగ్ మొత్తంమీద స్థితిపరుల జాబితాలోనే వస్తాడు. కాథొలిక్ మతం అంటే అతడికి గాఢాభిమానం, పరమభక్తి. హాప్స్‌బర్ రాజవంశం అంటేకూడా అతడికి ఇంత అభిమానమూ, ఇంత భక్తీ వున్నది.

ఇన్స్‌బ్రిక్ విశ్వ విద్యాలయంలో అతడు 'లా' చదువుకుని, డాక్టరేట్ పట్టాన్ని పొందాడు. క్రిస్టియన్ సోషల్ ఛాన్సలర్ సైపెల్ ప్రోత్సాహంవల్ల— అతడి సహాయంతో— షూష్నిగ్ రాజకీయాలలో ప్రవేశించాడు. ప్రారంభంలో ఆతడు విద్యా మంత్రి. తర్వాత న్యాయశాఖా మంత్రి. ఆతర్వాత— అంటే, డోల్ఫస్ మరణానంతరం— ఛాన్సలర్ అయ్యాడు.

డోల్ఫస్‌లోని చురుకుదనం గాని, వశీకరణశక్తిగాని అతడిలో లేదు. కాని, అతడు చాలా నమ్మకస్థుడు, ఆలోచనాపరుడు, పాపభీతి వున్నవాడు. తొందరపాటు అతడిలో మచ్చుకైనా లేదు. మంచి, చెడ్డల్ని ఆలోచించుకోనిదే కర్తవ్యాన్ని నిర్ణయించుకోడు. ఒకసారి కర్తవ్యాన్ని నిర్ణయించుకున్న తర్వాత, దానిని ఆచరణలో పెట్టడంలో సంకోచించడు.

షూష్నిగ్‌కు రాజకీయాలంటే అసలు అభిరుచి లేదు. ఇతిహాసం, న్యాయశాస్త్రం: ఈ రెండింటిలో ప్రొఫెసరు కావాలని అతడు ఆసిస్తూవుండేవాడు. అయితే, స్వదేశ పరిస్థితులు అతడిని రాజకీయరంగంలోకి ఈడ్చాయి.

షూష్నిగ్ భార్య 1935 వేసవిలో—అంటే, షూష్నిగ్ ఛాన్సలరు పదవికి వచ్చిన తర్వాత — మోటారుకారు ప్రమాదంవల్ల చనిపోయింది. అదే మోటారులో షూష్నిగ్ కూడా వున్నాడు గాని, కొద్దిలో అతడికి గండం తప్పింది. ఈ ప్రమా

దానికి నాజీలే కారకులని అంటారుగాని, దీన్ని నిరూపించడానికి తగినంత సాక్ష్యం లేదు. భార్య వియోగంవల్ల షూష్నిగ్‌కు కలిగిన పరితాపానికి అంతు లేదు. ఒక్క రాత్రిలో అతడి తల నెరిసిపోయింది; పాతిక సంవత్సరాలు ఒక్కసారిగా పైబడ్డట్టు అయింది. అయితే ఇందుమూలంగా అతడి దేశసేవా తత్పరత తగ్గలేదు సరిగదా, మరింత వృద్ధి అయింది. "నిన్ను మట్టుపెడతాము సుమా!" అని అతడికి నాజీలదగ్గరినుంచి బెదరింపు వుత్తరాలు వస్తూవుండేవి. వాటిని చూచి, భయపడిపోయి, రాజీనామా పెట్టమని అతడి భార్య వేడుకుంటూవుండేది. ఆమెను కాదనలేక అతడు రాజీనామాను పెట్టివేద్దామా అని అనుకుంటూవుండగానే మోటారుకారు ప్రమాదం సంఘటించింది. దీన్ని చూడగా "నేను ఏకాగ్రతతో దేశసేవ చెయ్యాలనే తలంపుతో భగవంతుడే ఇలా చేశాడేమో" అనే నమ్మకం అతడికి కలిగింది.

భార్య పోయిన రెండు సంవత్సరాలకు—1937లో—అతడికి కౌంటెస్ వెరా ఫగ్గర్ మీద ప్రేమ కుదిరింది. ఈమెమీద ప్రేమ కుదురుకున్న తర్వాత, అతడికి అంతకు పూర్వమున్నట్టి ధైర్యసాహసాలు, దేశసేవా తత్పరత కొంతవరకు వెనకబట్టినవని అంటారు.

ఇది యెంతవరకు నిజమో మనకు తెలియదుగాని, డాక్టరు షూష్నిగ్ మాతృదేశ స్వాతంత్ర్యాన్ని కాపాడాలని శక్తివంచన లేకుండా కృషి చేశాడు. అయితే — పాపం! — అతడి కృషి ఫలించలేదు. నాజీజం వెల్లువను అరికట్టాలని అతడు యత్నించాడు. కాని, ఆ వెల్లువలో తానే కొట్టుకు పోయాడు.

ఏ ప్రభుత్వానికైనా సరే బలం,— ప్రజలు! ప్రాణం,— ప్రజలు! ప్రజామోదం మీద ఆధారపడిన ప్రభుత్వం— ప్రజాప్రేమకు ఆలవాలమైన ప్రభుత్వం— అజేయంగా వుంటుంది. ఇక ఇందుకు భిన్నమైనట్టిదానికి పతనం తప్పదు. సైనికశక్తివల్లనో, రాజనీతిజ్ఞతవల్లనో, దౌర్జన్య ప్రయోగం వల్లనో, పరరాజ్యాల సహాయంవల్లనో అది ప్రాణాల్ని నిలబెట్టుకోవచ్చును. కాని ఇది తాత్కాలికంగా మాత్రమే!

షూష్నిగ్ ఈ సత్యాన్ని గుర్తించలేదు. డోల్ఫస్ మాదిరిగా అతడుకూడా దండనీతిని అవలంబించాడు; దౌర్జన్య విధానాన్ని అమలు జరిపాడు. ఇటలీ తోడ్పాటు నాకున్నది గదా,— ప్రజలతోగాని, వారి ఆమోదంతోగాని నాకు పని ఏమని అనుకున్నాడు. ఇదే అతడి పతనానికి — అతడి పతనానికి మాత్రమే గాక— అతడు దేన్ని రక్షించ జూచాడో ఆ ఆస్ట్రియాదేశ పతనానికికూడా కారణమైంది!

## 21

కసాయివాడు గొర్రెను పెంచుతున్నాడంటే, వాడికి దానిమీద ప్రేమ వున్నదనిగాని, తనకు లాభిస్తుందని తోచినప్పుడు దాన్ని వాడు కోయ్యకుండా వుంటాడని గాని, అనుకోవడంకంటె బుద్ధిమాంద్యం వుంటుందా? పై వాక్యంలో కసాయివాడికి బదులుగా ముసోలినీ అనీ, గొర్రెకుబదులు ఆస్ట్రియా అనీ చదువుకుంటే, ఆస్ట్రియాకు నేటి దౌర్భాగ్య స్థితి ఎందుకు పట్టిందో విశదమౌతుంది.

ముసోలినీకి ఆస్ట్రియా అంటే ప్రేమలేదు. దాని స్వాతంత్ర్య సంరక్షణ అంటే పట్టుదలలేదు. అసలు అతడికి తన సొంతవాడి దేశాన్ని మినహాయిస్తే, మరి ఏదేశం మీదనూ ప్రేమలేదు; తన సొంతవాడి స్వాతంత్ర్యాన్ని మినహాయిస్తే, మరి ఎవడి స్వాతంత్ర్యాన్ని గురించీ పట్టుదల లేదు. అతడికి కావలసింది ఇటాలియన్ సామ్రాజ్యం వీలైనంతవరకు విస్తరించడం; ఆ సామ్రాజ్యానికి తాను చండశాసనుడు కావడం. ఇదే అతడికోర్కె! అతడి ఆశ!! అతడి కల!!!

"అయితే, మరి ముసోలినీ ఆస్ట్రియా స్వాతంత్ర్య రక్షణకు ఎందుకు సహాయం చేశాడు?" ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరం చెప్పడం కష్టమైన పని కాదు. ఆస్ట్రియాను కబళించాలని హిట్లర్ పొంచి కూర్చున్నాడు. తను ఉపేక్ష చేస్తే, అది అతడి నోట పడుతుంది. ఇక, తాను దాన్ని తన కాపుదలలో పెట్టు

కుంటే, హిట్లరు తనతో బేరానికి దిగవలసి వస్తుంది. ఈ బేరం రాయితీగా వుంటే, సరే! కాకపోతుందా, ఆస్ట్రియావల్ల పొందగల ప్రయోజనాన్ని తానే పొందవచ్చును.

ముసోలినీకి ఆస్ట్రియాపట్ల మొదటినించీ వున్న వుద్దేశం— దురుద్దేశం అని అంటే ఎక్కువ సమంజసంగా వుంటుందేమో— ఇదేనని చెప్పడానికి ఒక్క నిదర్శనం చాలు. 1932 ఆగస్టు—సెప్టెంబరు ప్రాంతాలలోనే ఆస్ట్రియా విషయమై ఆతడు హిట్లరుతో రహస్య రాయబారాల్ని నడిపాడు. అప్పటికి హిట్లరు జర్మనీలో అధికారానికైనా రాలేదు. పైగా, అప్పటికి ఆస్ట్రియాపైన ఇటలీకి "గార్డియన్ షిప్" ఏర్పడలేదు. అయినప్పటికీ ముసోలినీ— తనకు నమ్మకైన బంటు అయినట్టి సీనార్ యూజెనియో మొరేల్ ద్వారా— మ్యూనిచ్‌లో వున్న హిట్లరుకు ఇలా వర్తమానం చేశాడు: "ఆస్ట్రియాను స్వతంత్రంగానే వుంచుతూ, ఆ దేశంలో నీకూ, నాకూ కూడా అనుకూలంగా వుండే ప్రభుత్వాన్ని స్థాపించుదాము. ఇలా మనం స్థాపించే ప్రభుత్వానికి ప్రస్తుతం ఆస్ట్రియాలో వున్న హైంమ్‌వీర్‌ను అండగా వుంచుదాము." ఆనాటికే హైంమ్‌వీర్ పోషణ నిమిత్తం ముసోలినీ రహస్యంగా ధనసహాయ్యాన్ని చెయ్యసాగాడు. అంచేత ఈ ప్రయివేట్ సైన్యాన్ని తాను వుద్దేశిస్తున్న నాజీ—ఫేసిస్టు ప్రభుత్వానికి అండగా నిలిపితే, ఆ ప్రభుత్వం తన గుప్పిటిలోనే వుంటుందన్నమాట! ఇంత పెద్ద పన్నాగం ముసో

లిని పంపిన వర్తమానంలో ఇమిడివుంది. దీన్ని హిట్లరు వెంటనే గ్రహించాడు. గ్రహించి, "హైమ్‌వీరును అండగా నిలపడం దేనికి? నాజీ సైనిక దళాలు లేవా?" అని అన్నాడు దీనితో అప్పటి రాజీప్రయత్నాలు భగ్నమైపోయాయి.

తర్వాత ఆస్ట్రియాలో నాజీలు విజృంభించడమూ, డోల్ఫస్ ఛాన్సలర్ కావడమూ, నాజీల పీడను వదిలించుకో డానికి డోల్ఫస్ ముసోలిని చంకకిందికి చేరడమూ, ఆస్ట్రియా మూలంగా జర్మనీ, ఇటలీ దేశాల మధ్య వైరం పెరగడమూ జరిగింది.

కొత్తగా అధికారానికి వచ్చిన తనకు ఇటలీతో వైరం పెంచుకోవడం క్షేమదాయకం కాదేమోనని హిట్లరుకు క్రమ క్రమంగా తోచసాగింది. అతడి అనుచరులు కూడా ఇదే అభి ప్రాయాన్ని వెల్లడించారు. అప్పు డతడు ఆస్ట్రియా విష యంలో ఏదైనా రాజీకి రావాలనే తలంపుతో 1934 ప్రారం భంలో వెనిస్ నగరానికి వెళ్ళి, ముసోలినీని కలుసుకున్నాడు. కాని, ఈ సమావేశం నిష్ఫలమైంది. విభిన్న దేశాలలో పుట్టి నవి గనక వేర్వేరు పేర్లు వచ్చాయిగాని, అంతరంగంలో ఫాసి జంకూ, నాజీజంకూ భేద మేమీ లేదు. ఇక, వాటినాయకులు దురాశలోనూ, దుర్మార్గంలోనూ, దురహంకారంలోనూ, వొకరిని మించినవా రొకరు. అంచేత వారిద్దరికీ మైత్రి కుద రవలసింది. కాని, ఎంచేతనో ఈ ప్రథమ సమావేశంలో

హారు పరస్పరం అసహ్యించుకోవడం జరిగింది. ముసోలినీ హిట్లరును చులకనగా చూచాడు; హిట్లరు ముసోలినీని అనుమానంగా చూచాడు. ఇక, వారిమధ్య రాజీ పొసగలేదంటే, ఆశ్చర్యం లేదుగదా!

వెనిస్‌నుంచి తిరిగివచ్చిన తర్వాత—సగం ముసోలినీ మీద కోపంచేత కాబోలు—హిట్లరు డోల్ఫుస్‌ను హత్య చేయించాడు. ఈ హత్య జరిగిన వెంటనే జర్మన్ సైన్యాలు ఆస్ట్రియాలో ప్రవేశించవలసిందే! అయితే, ముసోలినీ "కోడ్" ద్వారా పంపించిన సందేశం నాజీ గూఢచారుల చేతిలో పడింది. దీన్ని "డీ సైఫర్" చేసి చూచుకుంటే, ఇలా వుంది: "నాజీల చర్యలు ఆస్ట్రియా స్వాతంత్ర్యానికి భంగకరంగా రూపొందితే, ఇటాలియన్ సైన్యం ఆస్ట్రియాలో ప్రవేశించి, మ్యూనిక్ నగరంవైపుకు దండెత్తి వెళ్ళాలి." దీన్ని చూచి, హిట్లర్ బెదిరిపోయాడు. ఆస్ట్రియాకు తాత్కాలికంగా ఒక గండం తప్పింది.

అయితే, ఇటలీ అబిసీనియామీద దండయాత్రను ప్రారంభించడంతో పరిస్థితులు తారుమారు అయిపోయాయి. ఆస్ట్రియా స్వాతంత్ర్య రక్షణకు తాను బాధ్యత వహిస్తే అందుకు ప్రతిఫలంగా బ్రిటన్-ఫ్రాన్సులు తాను అబిసీనియాను ఆక్రమించుకోడానికి అనుకూలిస్తా యని ముసోలినీ అనుకున్నాడు అతడు ఇలా అనుకో డానికి తగినంత ఆధారం

లేకపోలేదు కూడా. 1935 మార్చి 16 వ తేదీనాడు జర్మనీ-వర్సయిల్స్ సంధి షరతుల్ని ధిక్కరించి, ఆయుధ సేకరణ కార్యక్రమాన్ని ప్రకటించింది. దీన్ని చూడగానే బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ రాజ్యాలకు జర్మనీని అదుపాజ్ఞలలో పెట్ట వలసిన అవసరం వచ్చినట్లు తోచింది. అంతట ఆ మూడు రాజ్యాలు 1935 ఏప్రిల్ 11 వ తేదీనాడు స్ట్రెస్సాలో సమావేశమై, తమ కర్తవ్యం ఏమని సమాలోచనలు జరిపినవి. ఈ సమాలోచనలలో ఆస్ట్రియా స్వాతంత్ర్య రక్షణకు ఉపాయాలు ఏవేవి అనే సమస్యకూడా చర్చకు వచ్చింది. అప్పుడు ముసోలినీ "ఆస్ట్రియా పూచీ నాది" అని చెప్పాడు. "అయితే, ఇటలీకి సామ్రాజ్యం విషయంలో వున్న కోర్కెల్ని కొన్నింటిని ముందుగా తీర్చవలసివుంటుంది సుమా!" అని కూడా అతడు హెచ్చరించాడు. ఇందుకు బ్రిటన్-ఫ్రాన్సులు "సరే" అని అనలేదుగాని, "కా"దని కూడా ఖండితంగా చెప్పలేదు. దీన్ని చూచి "మౌనం అర్థాంగీకారం" గదా అని ముసోలినీ అనుకున్నాడు. ఇందుకు తగినట్లు స్ట్రెస్సా సమావేశానికి మూడు మాసాలముందు — 1935 జనవరి మొదటి వారంలో—ఫ్రెంచి ప్రధాన మంత్రి లావల్ రోంనగరానికి వెళ్ళి, ఆస్ట్రియా స్వాతంత్ర్య సంరక్షణ విషయమై ముసోలినీతో సంభాషణలు నడపడమూ, ఈ సంభాషణలలో అతడు అబిసీనియాను ఇటలీ ఆక్రమించుకుంటే తమకు అభ్యంతరం లేదని చూచాయగా చెప్పడమూ జరిగింది కూడా! దీన్ని

బట్టి ఆస్ట్రియా స్వాతంత్ర్య సంరక్షణకు తాను పూచీ పడ్డంత వరకు, బ్రిటన్ ఫ్రాన్సులు తన అబిసీనియా జైత్రయాత్రకు అభ్యంతరం చెప్పవుగదా అనే ధైర్యంతో ముసోలినీ ఆ అభాగ్య రాజ్యంమీదికి తన సైన్యాలను పంపించాడు. కాని, అతడు తీరా ఈ పనిచేసిన తర్వాత బ్రిటన్—ఫ్రాన్సులు తల వని తలంపుగా ఎదురు రావడమూ, నానాజాతి సమితి ద్వారా శాంక్షన్సు ప్రకటించడమూ జరిగింది. దీనితో ముసోలినీ అనేక చిక్కులలో పడిపోయాడు. హిట్లరుకు మంచి అదును దొరికింది.

ఇప్పుడు జర్మనీ రెండు మార్గాల్ని అవలంబించవచ్చు: శాంక్షన్సు ప్రకటించిన రాజ్యాలతో చేరి, అది ఇటలీని ఉక్కిరి బిక్కిరి చెయ్యవచ్చును; సెంట్రల్ యూరప్‌లో ఇట లీకి గల ప్రతిష్ఠను భగ్నంచేసి, తనదే పై చెయ్యి అనిపించుకో వచ్చును. లేదా, అది ఇటలీపట్ల తాటస్థ్యాన్ని వహించి, దాని సదభిప్రాయాన్ని సంపాయించుకో వచ్చును. ఈ రెండింటిలో రెండో మార్గమే ఉత్తమమైనదిగా హిట్లర్ నిర్ణయించాడు.

ఈ నిర్ణయానికి రావడానికి ముందు అతడుచేసిన ఆలో చనలు ఇవి: "ఇటలీ సద్భావాన్ని సంపాయించుకుంటే, రైన్ లాండ్‌లోను, సెంట్రల్ యూరప్‌లోను తమచిత్తంవచ్చిన ఆట ఆడవచ్చును. అబిసీనియా విషయంలో బ్రిటన్—ఫ్రాన్సులు ఇటలీని కలిసి ప్రతిఘటిస్తున్నా, వీటి విషయాలలో కొంత

విభేద మున్నది. బ్రిటన్ తాపత్రియం తన మెడిటరేనియన్ రహదారికి ముప్పు రాగూడదని మాత్రమే! ఇక ఫ్రాన్సు నేను రైన్‌లాండ్‌ను నా సైన్యంతో ఎక్కడ ఆక్రమించుకుంటానో అని మాత్రమే భయపడుతున్నది. అంచేత ఈ రెండు రాజ్యాలు ఇటలీతో పేచీపడుతూవుండగా, రైన్‌లాండ్‌కు నేను నా సైన్యాన్ని పంపుతాను. అప్పుడు "రైన్‌లాండ్‌ను జర్మనీ సైన్యం ఆక్రమించడాన్ని ప్రతిఘటించవా?" అని ఫ్రాన్సు బ్రిటన్‌ను అడుగుతుంది. మెడిటరేనియన్‌లో ఇటలీవల్ల నాకు అపాయం సంభవిస్తే నీవు నాకు తోడ్పడతావా?" అని బ్రిటన్ ఫ్రాన్సును అడుగుతుంది. ఈ బేరాలు చివరికి మంచి పడవు. నా రొట్టె నేతిలో పడుతుంది.

"ఇంతేగాక, ఈనాడు ఇటలీ అబిసీనియామీద ఆక్రమానికి దిగిందని నానాజాతి సమితిలోని రాజ్యాలు దానిమీద శాన్‌క్షన్సును ప్రకటించినవి. రేపు ఈ రాజ్యాలే నామీద కూడా ఇదేచర్యను జరపగూడదా? అంచేత శాన్‌క్షన్సు విధానాన్ని నేను జయప్రదం కానివ్వకూడదు; దాన్ని భగ్నం చెయ్యాలి."

హిట్లర్ చేసిన ఈ ఆలోచనలు సరియైనవే అని త్వరలోనే నిరూపితమైంది. 1936 మార్చి 7 వ తేదీనాడు అతను తన సైన్యాన్ని పంపించి, రైన్‌లాండ్‌ను ఆక్రమించుకున్నాడు. ఇది వర్సయిల్స్ సంధి షరతులకూ, లోకార్నో ఒడంబడికకూ

భిన్నమైన కార్యమే అయినప్పటికీ, బ్రిటన్—ఫ్రాన్సులు—హిట్లర్ చేసిన యోచనల ప్రకారమే—ఏవిధమైన చర్యను జరపలేక పోయాయి!

"హిట్లరు తనకు లాభిస్తున్నదిగదా అని ఇటలీ తాటస్థ్యాన్ని అవలంబించవచ్చును. అయితే, జర్మనీకీ, ఇటలీకి రాజీ కుదరడానికి ఆస్ట్రియా తప్పకుండా ప్రతిబంధకి మా తుంది" అని బ్రిటన్—ఫ్రాన్సులు ఈ సమయంలో ఆశ పడ్డాయి. కాని, ఈ ఆశకూడా అడియాస అయింది. అబిసీనియా యుద్ధం కొనసాగినకొద్దీ, శాన్క్షన్స్ అమలులో వున్నకొద్దీ, ఇటలీ బలం తగ్గసాగింది; జర్మనీ బలం హెచ్చసాగింది. అంచేత ఏదో ఒకవిధంగా తాను ఆస్ట్రియావిషయంలో జర్మనీతో రాజీకి రావడమే శుభప్రదమని ముసోలినీకి తోచసాగింది. అంచేత, 1935 ఆగష్టునెల నాటికే అతడు రాజీ విషయమై రోంనగరంలోని జర్మన్ రాయబారి హెర్ వాన్ హాసెల్‌తో సంభాషణలు ప్రారంభించాడు.

ఒకవైపున ముసోలినీకీ, జర్మన్ రాయబారికీ మధ్య ఇలా సంభాషణలు జరుగుతూవుండగా, ఇంకోవైపున బ్రిటిష్ ప్రభుత్వం తరఫున సర్ ఆస్టిన్ ఛేంబర్లియన్ వియన్నా వెళ్ళి, ఆస్ట్రియా ఇక ఇటలీమీద ఆశ పెట్టుకోవడం కూడదనీ, జర్మనీతో అనుకూలమైన రాజీని కుదుర్చుకోవడం మంచిదనీ సలహా ఇచ్చాడు. ఈసలహా స్వీకరించడమా, కూడదా అని కొంత

కాలంపాటు సంకోచించిన తర్వాత ఛాన్సలర్ షూష్నిగ్ రోంన గరానికి వెళ్ళి, ముసోలినీని "నీవు ఏమి చెబుతావు?" అని అడిగాడు. ఇందుకు "నా వుద్దేశంలో కూడా రాజీకి రావడమే మంచిది" అని ముసోలినీ అన్నాడు.

ఇక్కడ "రాజీ" అనేమాటకు ముసోలినీ చెప్పుకున్న అర్థం 'ఆస్ట్రియా స్వాతంత్ర్యానికి నామ మాత్రంగా భంగం రాకుండా, ఆ రాజ్యం హిట్లర్ అధీనమై పోవాలి' అనే! అతడు ఇలా అర్థం చెప్పుకున్నా డని చెప్పడానికి ఈ ఒక్క నిదర్శనం చాలును: అప్పటిలో తనవిదేశాంగశాఖకు అధికారిగా వున్న డాక్టర్ సువిచ్ జర్మనీకి ప్రతికూలుడని ప్రతీతివుంది. అంచేత జర్మనీ విశ్వాసాన్ని సంపాయించాలంటే, అతడిని బర్తరఫ్ చెయ్యక తప్పదుగదా! ముసోలినీ సరిగా ఇదేపనిని చేశాడు. అతడు డాక్టర్ సువిచ్‌ను తొలగించి, అతడి స్థానంలో జర్మనీ అంటే అభిమానం వున్న తనఅల్లుడు కౌంట్ సియానోను నియమించాడు.

కసాయివాడికి ఇక గొర్రెను కొయ్యడం లాభమని తోచాలేగాని, సంకోచిస్తాడా!

## 22

అశ్రద్ధ, అజాగ్రత్త ఇవి రెండూ హెర్ వాణ్ ఫ్రాంజ్ పాపన్ లో ప్రధానమైన లక్షణాలు. గత ఐరోపా మహాసంగ్రామం రోజులలో అతడు అమెరికాలో జర్మన్ రాయబారిగా వుంటూ వుండేవాడు. అప్పుడొకనాడు న్యూయార్కు నగరంలో అతడు ఒక టేక్సీలో తన "ఎటాచీ కేస్"ను అశ్రద్ధగా వదిలివేశాడు. ఈ "ఎటాచీ కేస్"లో బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ మొదలైన రాజ్యాలవారి వోడల్ని బాంబులు వేసి ముంచివేయడానికి తగిన ప్లాను లున్నాయి. ఈ కుట్ర వెల్లడి కావడంవల్ల జర్మనీ ప్రతిష్ఠకు భంగం రావడమే కాకుండా, ఈ విషయంతో జోక్యమున్న ఆస్ట్రియన్ ఎంబసీ (రాయబారి కార్యాలయం) కూడా చిక్కుల పాలైంది. పోనీ, ఇంతటితో అతడు జాగ్రత్తగా వుండడం నేర్చుకున్నాడా? అబ్బే! లేదు అమెరికా ప్రభుత్వం "నీవు మా దేశంనుంచి వెళ్ళిపో!" అని ఆజ్ఞాపించగా, అతడు స్వదేశానికి బయల్దేరాడు. దారిలో ఒక బ్రిటిష్ యుద్ధనౌక అతడి వోడను సోదాచూచింది. ఈ సోదాలో కొంపల్ని తీసే డాక్యుమెంట్సు మరికొన్ని దొరకడమే కాకుండా, అమెరికాలోని జర్మన్ గూఢచారుల కిచ్చిన మొత్తాల్ని తెలిపే చెక్ బుక్ కూడా దొరికింది. దానిద్వారా అమెరికాలో వున్న జర్మన్ గూఢచారుల్ని అందరినీకూడా అరెస్టు చెయ్యడానికి వీలు చిక్కింది తర్వాత 1931 లో కూడా అతడు ఇలాంటి అవకతవక పనినే చేశాడు: ఆ సంవ

త్సరంలో హెర్ వాన్ పాపన్ — అప్పుడతను జర్మనీకి ఛాన్సలర్ — ఎన్నికలను జరిపాడు. ఈ ఎన్నికలల్లో తలవని తలంపుగా నాజీలు చాలా "సీట్లు"ను గెలుచుకున్నారు. అప్పుడిక పాపన్ కర్తవ్యం తనఛాన్సలర్ పదవికి రాజీనామా ఇవ్వడమే! అయితే, జర్మనీ ప్రెసిడెంట్ హెర్ వాన్ హిండెంబర్గు రాజీనామా ఇవ్వవద్దనీ, కొత్తగా ఏర్పడ్డ రైష్‌స్టాగ్‌ను— ఇది జర్మనీ పార్లమెంటు — రద్దు చెయ్యమనీ చెప్పాడు. 'సరే' అని పాపన్ "రైష్‌స్టాగ్" సమావేశానికి వస్తూ ప్రెసిడెంట్ సంతకం పెట్టి ఇచ్చిన "డిక్రీ"ని ఎక్కడనో పెట్టి, మరిచిపోయాడు. అయితే, అదృష్టంకొద్దీ అది తుదిక్షణంలో కనబడింది.

అశ్రద్ధకు, అజాగ్రత్తకు ఇంతపేరు పడ్డప్పటికీ 1936లో ఆస్ట్రియాతో రాయబారాన్ని నడిపే సందర్భంలో పాపన్ చాలా చురుకుతనాన్ని, తెలివి తేటల్ని, చూపించాడనే చెప్పాలి. 1934 జూన్ 30 వ తేదీనాడు హిట్లర్ జర్మనీలో జరిపిన— జరిపించిన— భీషణహత్యాకాండలో హెర్ వాన్ పాపన్‌కూడ హతుడై వుండవలసిందే! కాని, 1933 లో తను ఛాన్సలర్ పదవిని సంపాయించుకోడానికి చేసిన యత్నాలకు పాపన్ చేసిన తోడ్పాటుకు కృతజ్ఞతగా కాబోలు, హిట్లర్ అతడి ప్రాణాన్ని కాపాడి, వియన్నాకు రాయబారిగా పంపించాడు! ఇలా పంపుతూ "ఆస్ట్రియా నాగుప్పిటిలోకి రావడానికి

నీవు శక్తివంచన లేకుండా కృషిచేసి, నాపట్పుదలను నెగ్గించాలి సుమా!" అని హెచ్చరించాడు. ఈ హెచ్చరికను జ్ఞాపకం వుంచుకుని— జ్ఞాపకం వుంచుకోక పోతే తనకు పట్టే గతిని కూడా తలచుకొని— పాపన్ చాలా మెలకువతో సంచరించాడు.

ఆస్ట్రియాను లొంగదీసుకోడానికి అతడు అవలంబించిన విధానం ఇది: ఆస్ట్రియన్ రాజకీయ వేత్తలలో ప్రముఖులైన వారిని ఒక పక్కకు పిలవడమూ, వారి చెవిలో "నాకు కూడా నాజీ ప్రభుత్వం అంటే అభిమానం ఏమీ లేదు. అయితే, మనమందరము జర్మన్ జాతి క్షేమంకోసం పాటుపడాలి" అని ఊదడమూ. ఈ విధానంవల్ల సత్వర ఫలితాలు కనబడని మాట నిజం! అయితే చివరికి ఇదే వాంఛాసిద్ధిని కూర్చింది. ఈ విధానాన్ని అవలంబించడంలో—జాన్ గంథర్ చక్కగా చెప్పినట్టు—పాపన్ చేసిన ఆలోచన ఇది: "వచ్చేవారంలో పెండ్లాడబోతున్న కన్యను వెంటనే అనుభవించితీరాలని పట్టుపట్టడంలో అర్థం లేదుగదా!"

రోజులు బాగుండబట్టి, అతడికి అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులు కూడా—ఇంతకు ముందు వివరించినట్టు— కలిసి వచ్చాయి. ఈ అన్ని అవకాశాల్ని ప్రయోగించుకొని, 1936 జులైలో పాపన్ ఆస్ట్రియాలో ఒడంబడికను కుదర్చగలిగాడు. ఈ ఒడంబడిక షరతులు ఇవి: (1) జర్మనీ ఆస్ట్రియా స్వాతం

త్యాన్ని ఆమోదించడం; (2) ఆస్ట్రియా తను జర్మన్‌జాతికి చెందిన రాజ్యాన్ని అని అంగీకరించి, అందుకు అనుగుణ్యంగా నడుచుకోవడం; (3) ఉభయరాజ్యాలు ఒకదాని అంతరంగిక వ్యవహారాలలో ఇంకొకటి జోక్యం కలగజేసుకోకుండా వుండడం; (4) ఆస్ట్రియా నాజీ ఖైదీల నందరిని విడుదలచేసి, నాజీలు— పార్టీగా కాకుండా— వ్యక్తులుగా 'ఫాదర్‌లాండ్ ఫ్రంట్' లో చేరడానికి అనుమతించటం.

ఈ ఒడంబడికమీద సంతకాలు జరగగానే హిట్లర్— షూష్నిగ్— ముసోలినీల మధ్య అభివందన తంతివార్తలు నడిచాయి. దీన్నిచూచి "అబ్బ! ఇప్పటికి ఆస్ట్రియాసమస్య పరిష్కారమైంది!" అని అమాయకులు కొందరు సంతోష పడ్డారు. అయితే, ఈ భ్రమ తొలగడానికి ఎంతోకాలం పట్టలేదు!

జర్మనీతో ఒడంబడికకు రావడంవల్ల ఆస్ట్రియా చిక్కులు తీరలేదు గదా,— అవి మరింత హెచ్చిపోయాయి. "హిట్లరుతో ఇప్పుడు మనకు వైరంలేదు. అంచేత మనకు నాజీల బాధ తప్పుతుంది" అని షూష్నిగ్ ఆశించాడు, కాని ఆబాధ తప్పలేదు. "ఆస్ట్రియా తను జర్మన్‌జాతికి చెందిన రాజ్యాన్ని అని అంగీకరించింది గనక, జర్మన్‌జాతికి చెందిన రాజ్యంలోనుంచి జర్మనీరాజ్యంగా పరివర్తన చెందడానికి ఆట్టే కాలం పట్టదు" అని హిట్లర్ అనుకున్నాడు. కాని అతడి

ఆశ ఈడేరే సూచనలు కనబడలేదు. ఇందువల్ల ఒడంబడిక జరిగిన కొన్ని నెలలకే జర్మనీ, ఆస్ట్రియా డిక్టేటర్లకు ఇద్దరికీ కూడా ఆశాభంగం కలిగింది.

షూష్నిగ్ ఒడంబడికకు అంగీకరించడానికి అనేక కారణా లున్నవి— నిజమే! అయితే, అతడి దృష్టిలో ప్రధానకారణం జర్మనీ అవలంబిస్తున్న బహిష్కరణ విధానం. ఆస్ట్రియాకు విహారార్థం వెళ్ళేవారిమీద హిట్లర్ అమలుపరచిన నిషేధాల వల్ల ఆస్ట్రియాకు "టూరిస్టుల" ద్వారా వచ్చే పెద్ద ఆదాయం పడిపోయింది. ఇందుకుతోడు ఆస్ట్రియా—జర్మనీదేశాల మధ్య వున్న వర్తక వ్యాపారాలకు కూడా హిట్లర్ అనేక ప్రతిబంధ కాల్ని కల్పించాడు. ఇందువల్లకూడా ఆస్ట్రియాకు నష్టం వాటిల్లింది. ఈవిధంగా హిట్లర్ తమకు అనేకవిధాల నష్టాన్ని కలిగించడాన్ని చూచి, జర్మనీతో ఒడంబడికకు రాకతప్ప దని షూష్నిగ్ నిర్ణయించుకున్నాడు. అయితే, ఒడంబడిక జరిగిన తర్వాతకూడా ఆస్ట్రియా నష్టం పూడనూ లేదు; దాని ఆర్థికవు చిక్కులు తీరనూ లేదు. నిజానికి ఇందులో ఆశ్చర్య మేమీ లేదుకూడా! హిట్లరుకు కావలసింది ఆస్ట్రియా ఆక్రమణ. అది జరగనంతవరకు అతడు ఆదేశాన్ని సుఖంగానూ, శాంతిగానూ వుండనిస్తాడా? ఈ పరిస్థితిలో జర్మనీ బహిష్కరణనుంచి తప్పించుకోడానికి షూష్నిగ్‌కు ఒక వుపాయం తోచింది. అది ఏమంటే,—హంగరీ, జెకోస్లావాకియా, రుమేనియా, యూగో

స్లావియా రాజ్యాలతో ఒడంబడికకు రావడం. ఈ అన్ని చిన్న రాజ్యాలలోనూ పలుకుబడిని సంపాయించుకోవాలని ముందు ముసోలినీ ప్రయత్నించాడు. ఆ తర్వాత —ముసోలినీ అబిసీనియా యుద్ధంలో నిమగ్నుడై వుండగా— హిట్లర్ ఇదే పనికి పూనుకున్నాడు. ఇలా వీరు పలుకుబడి సంపాయించుకోవడ కోసం ప్రయత్నించడం కేవలం తమ స్వార్థసిద్ధికోసమే గాని, ఈ రాజ్యాలను ఏమో తవ్వి నెత్తి కెత్తుదామని కాదు. అవసరమని తోచినప్పుడు వీరిద్దరు ఈ రాజ్యాలను తమతో పాటు యుద్ధాలలోకి ఈడుస్తారు కూడా! అంచేత ఈ చిన్న రాజ్యాలు ఏదో ఒక పెద్దరాజ్యాన్ని అంటిపెట్టుకుని, దాని స్వార్థసిద్ధికి సాధనాలు కావడంకంటె, తమలో తాము సైనిక రక్షణకోసమూ, వర్తక వ్యాపారాల అభివృద్ధికోసమూ ఏర్పాటు చేసుకోవడం క్షేమదాయకం. ఇలా ఆలోచించి, డాక్టర్ షూష్నిగ్ హంగరీ, జెకోస్లావాకియా, రుమేనియా, యూగోస్లావియా ప్రభుత్వాలతో ఒడంబడికకోసం రాయబారాల్ని నడిపాడు. కాని, ఆస్ట్రియా దురదృష్టంకొద్దీ ఈ రాయబారాలు ఫలించలేదు.

ఒకవైపున పైనచెప్పిన రాజ్యాలతో రాయబారాలను సాగిస్తూ, ఇంకోవైపున ఆస్ట్రియా స్వాతంత్ర్యసంరక్షణకోసం అతడు ఇంకొక యోచనకూడా చేశాడు ఈ యోచన ఏమంటే,—హాప్స్‌బర్గు వంశీయుడైన ఆటో రాకుమారుడికి

పట్టం కట్టడం. అయితే ఇది కొత్త యోచన కాదు. డాక్టర్ డోల్ఫస్ పరిపాలనా కాలంనుంచీకూడా ఇది ఆస్ట్రియన్ రాజకీయవేత్తల మనస్సులలో పనిచేస్తూనే వుంది.

ఆటో రాకుమారుడికి పట్టం కట్టడంలో ఆస్ట్రియా తిరిగి "మానార్కిస్ట్" రాజ్యం అవుతుంది. అప్పుడు డిక్టేటర్‌షిప్ రాజ్యంగా వున్న జర్మనీకి ఆస్ట్రియా 'ఆక్రమణానికి దండయాత్ర తప్ప ఇతరసాధనం వుండదు. జర్మనీ ఇలా బహిరంగంగా దండయాత్ర జరిపితే, ఇటలీ, ఫ్రాన్సు, బ్రిటన్ మొదలైన రాజ్యాలు అడ్డుపడవచ్చును. అంచేత తప్పనిసరి అయినప్పుడు—గత్యంతరం లేకపోయినప్పుడు—చల్లగా ఆటో రాకుమారుడిని సింహాసన మెక్కించవలసిందే! ఇలా అనుకుని డాక్టరు డోల్ఫస్ 1934 లోనే హాప్స్‌బర్గు రాజవంశ పరిపాలనను పునరుద్ధరించడానికి కొంతనందు ఏర్పరిచాడు. 1919 నాటి ఆస్ట్రియా రాజ్యాంగ విధానం హాప్స్‌బర్గు రాజవంశీయుల్ని దేశభ్రష్టుల్ని చేసింది; వారి ఆ స్తిపాస్తుల్ని ప్రభుత్వం వశపరచుకోవా లన్నది. 1934లో కొత్తదైన "కార్పొరేటివ్" రాజ్యాంగవిధానాన్ని అమలు పరుస్తూ, దానిలోనుంచి హాప్స్‌బర్గు రాజవంశానికి సంబంధించిన భాగాల్ని డాక్టరు డోల్ఫస్ యెత్తివేశాడు. అంటే, అతడు చేసినపని హాప్స్‌బర్గు రాజవంశానికి విరుద్ధమైన శాసనాల్ని రాజ్యాంగంనుంచి తొలగించడమేగాని, వాటిని పూర్తిగా రద్దుచెయ్యడం కాదు.

డాక్టర్ డోల్ఫస్‌కంటె ఒక అడుగు ముందుకు వెళ్ళి 1935 జులై నెలలో డాక్టర్ షూష్నిగ్ అసలు ఆ శాసనాలనే రద్దు చేశాడు. తర్వాత 1937 ప్రారంభంలో అతడు ఆటో రాకుమారుడికి పట్టం కట్టాలనే కుతూహలాన్ని కూడా కనబరిచాడు. ఈ సంగతి తెలిసేసరికి హిట్లరుకు చెడ్డకోపం వచ్చింది. జర్మనీ డిక్టేటరుకు కోపం వచ్చినట్టు వినగానే, అతడి సద్భావాన్ని — అతడి సహాయాన్ని — అతడి సహకారాన్ని — అపేక్షిస్తున్న ముసోలినీ తన పత్రికలకు కనుసైగ చేశాడు. వెంటనే ఇటాలియన్ పత్రికలు అన్నీ కూడా ఆటో రాకుమారుడికి పట్టం కట్టడం అనుచితం అంటూ డాక్టరు షూష్నిగ్‌ను తీవ్రంగా విమర్శించాయి. ఇంతే కాదు. ముసోలినీకి "మౌతి పీస్" అని పేరందిన సీనారుగేడా "ఆస్ట్రియా సంరక్షణ భారాన్ని ఇక మేము వహించము సుమా!" అని ధ్వనించాడు. దీన్ని చూచి షూష్నిగ్ బెదిరిపోయాడు.

ఇటలీ హాప్స్‌బర్గు రాజవంశపరిపాలన పునరుద్ధరణకు వ్యతిరేకంగా వున్నట్టు తెలిస్తే, డాక్టర్ షూష్నిగ్ అసలు ఆ విషయమై కుతూహలాన్ని కనబరచేవాడు కాడేమో! ఆటో రాకుమారుడికి పట్టం కట్టడమూ, మానడమూ అనే విషయం ఆస్ట్రియా ఆంతరంగిక సమస్య అని షూష్నిగ్‌తో ముసోలినీ ఏకీభవించాడు. పైగా, 1937 ఫిబ్రవరిలో ఆటో రాకుమారుడి మేనమామతో ప్రసంగిస్తూ, "మీ మేనల్లుడికి

పట్టాభిషేకం చెయ్యడం నాకూ సమ్మతమే!" అని సూచించాడు. తెలివితక్కువవాడు కావడంవల్ల ఈ మాటలు అన్నీ నిజమేనని నమ్మి, డాక్టరు షూష్నిగ్ మోసపోయాడు.

ఈ కపట నాటకంవల్ల ముసోలినీ మంచి లాభాన్నే పొందాడు. "ఆటో రాకుమారుడికి మీరు పట్టం కట్టుకోవచ్చు" అని అతడు ఆస్ట్రియా ప్రభుత్వంవారిని ఉత్సాహపరిచాడు. తద్వారా హిట్లరుకు ఆగ్రహం తెప్పించాడు. తర్వాత హిట్లరుకు పెద్ద మెహర్బానీ చేసినట్టు "పట్టాభిషేకం, గిట్టాభిషేకం పనికిరాదుసుమా!" అని మందలించాడు. దీని ఫలితం,—హిట్లరు తనకు కృతజ్ఞుడు కావడం!

మోసగాళ్ళు ఎందరో వుండవచ్చును. అయితే, అందరు మోసగాళ్ళు ముసోలినీ అంతటి తెలివిగలవాళ్ళు కాలేరు!

## 24

"ఆస్ట్రియా తాను జర్మన్‌జాతికి చెందిన రాజ్యాన్ని అనే విషయాన్ని అంగీకరిస్తున్నది"—1936 జూలై నెలలో జరిగిన ఆస్ట్రో-జర్మన్ ఒడంబడికలో ఇదిమొదటి షరతు. ఈ షరతు ఆధారంతో సైనికబల ప్రదర్శనంగాని, దౌర్జన్య ప్రయోగంగాని లేకుండానే క్రమంగా ఆస్ట్రియాను తన గుప్పిటిలోకి తెచ్చుకోవచ్చునని హిట్లరు ఆశించాడు. కాని, అతడు

అనుకున్నట్లు జరగలేదు. త్వరలో అలా జరగగలదనే ఆశ కూడా క్రమేణా చచ్చిపోసాగింది. అంచేత అన్యమార్గాల ద్వారా తన కోర్కెలు సిద్ధింపజేసుకోవాలని అతడు నిశ్చయించుకున్నాడు.

తీవ్రంగా ఆలోచించిన మీదట అతడికి ఒక ఉపాయం తోచింది. ఆ ఉపాయం ఇది: ఆస్ట్రియనులకు ఎవరికైనా కొందరికి లంచం పెట్టి, వారిచేత వియన్నాలోని జర్మన్ రాయబారి కార్యాలయంమీద దౌర్జన్యాన్ని చేయించడం. దౌర్జన్యం జరిగినందుకు ఆస్ట్రియన్ ప్రభుత్వం క్షమాపణ చెప్పాలనీ, నష్టపరిహారాన్ని ఇచ్చుకోవాలనీ కోరడం. ఇందుకు ఒకవేళ ఆస్ట్రియన్ ప్రభుత్వం అంగీకారాన్ని చూపించినా, కలహాన్ని చంపుకోక, మరికొన్ని షరతుల్ని పెట్టి, వాటి మిషమీద ఆస్ట్రియామీదికి దండెత్తివెళ్ళడం.

హిట్లర్ చేసిన ఈ ఆలోచన బాగానే వున్నదిగాని, కార్యాచరణలోకి వచ్చేసరికి — పాపం! — బెడిసి కొట్టింది! వియన్నాలోని జర్మన్ రాయబారి కార్యాలయంమీద దౌర్జన్యాన్ని చేయించడానికి ఇంకా ఏర్పాట్లు చేయిస్తూవుండగానే వియన్నా పోలీసువారు ఈ రహస్యాన్ని కనిపెట్టివేశారు. దానితో హిట్లరుకు ఎంత ఆశాభంగం కలిగిందో, అంత క్రోధావేశం కూడా పెరిగింది. "ఆస్ట్రియాను కబళించనిదే నేను నిద్రపోను" అని అతడు ప్రతిన పట్టాడు.

ఈలోపుగా అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులు అతనికి అనుకూలంగా పరిణామం చెందాయి. ఇటలీ అబిసీనియాను జయించుకున్నప్పటికీ, అక్కడ శాంతి ఏర్పడలేదు. దాస్యాన్ని భరించలేక కొన్నిచోట్ల, ఇటాలియన్ నిరంకుశత్వాన్ని సహించలేక కొన్నిచోట్ల, మొత్తంమీద అనేక రాష్ట్రాలలో అబిసీనియనులు తిరుగుబాటు ప్రారంభించారు. అంచేత అక్కడికి ముసోలినీ చాలా సైన్యాన్ని పంపవలసివచ్చింది. ఇందుకు తోడు బ్రిటనులో శాంక్షన్సు ప్రకటించిన కారణంగా ఏర్పడ్డ వైరం చచ్చిపోనే లేదు. అంచేత లిబియాలో— ఈజిప్టు సరిహద్దులమీద—పెద్ద సైన్యాన్ని బెదరింపుకోసం వుంచవలసివచ్చింది. ఇక స్పెయిన్ విద్రోహం కూడా పెద్ద చిక్కు అయిపోయింది. ఏ రెండుమూడు నెలలలోనో జనరల్ ఫ్రాంకో జయిస్తాడని, స్పెయిన్ సామంతరాజ్యం అయిపోతుందని అనుకుంటే, స్పెయిన్ ప్రజలు ఈ ఆశను అడియాస చేశారు. ఇంతవరకూ వచ్చిన తర్వాత ఇపుడు స్పెయిన్ నుంచి చల్లగా తప్పుకోవడానికి వీలులేదు. పోనీ దీని అంతు చూద్దామా అంటే, అబిసీనియాలోనూ, లిబియాలోనూ పెద్దపెద్ద సైన్యాలను పోషిస్తూ, ఇంకా స్పెయిన్‌కు కూడా కొత్తగా సహాయాన్ని పంపడం సాధ్యమా? పులిమీద పుట్ర అన్నట్టు ఇంకొక కొత్తయిబ్బంది కూడా కలిగింది. సక్రమసైనిక శిక్షణ గాని, ఆధునిక యుద్ధసాధన సంపత్తిగాని ఏమాత్రమూ లేని స్పెయిన్ రిపబ్లికన్ సైనికులచేతిలో ఇటాలియన్ సైనిక

దళాలు గ్వెడల్‌జారా యుద్ధరంగంలో వోడిపోయినవి. కేవలం వోడిపోవడమే కాకుండా అవి అతినీచంగా పలాయనాన్ని చిత్త గించినవికూడా! ఇందువల్ల ఇటలీప్రతిష్ఠ కూడా తగ్గింది. ఈ స్థితిలో జర్మనీనుంచి కొత్త సహాయాన్ని అర్థించక తప్పదనీ, హిట్లరును ఇంకా సుముఖుడిని చేసుకోవడం ఆవశ్యకమనీ ముసోలినీకి తోచింది. ఈ కార్యాన్ని సాధించడం కోసం అతడు 1937 అక్టోబరులో అల్లుడు కౌంట్ సియానోను వెంటపెట్టు కుని స్వయంగా జర్మనీ వెళ్ళాడు.

అపుడు హిట్లర్—ముసోలినీల మధ్య ఏమి వొడంబడిక జరిగిందో ఖాయంగా తెలియదుగాని, ఒక్క విషయం మాత్రం స్పష్టం: స్పెయిన్ విద్రోహం విషయంలో తాను ముసోలినీకి తోడ్పడాలంటే, ఆస్ట్రియా విషయంలో ముసోలినీ పరిపూర్ణ మైన తటస్థభావాన్ని వహించాలని హిట్లర్ కోరివుంటాడు. ఇందుకు ముసోలినీ అంగీకరించి వుంటాడు.

ముసోలినీ పరిపూర్ణమైన తాటస్థ్యాన్ని అవలంబించ డానికి అంగీకరిస్తే, ఇక ఆస్ట్రియా ఆక్రమణకు అభ్యంతరం ఏ ముంటుంది? అన్నట్టు, బ్రిటన్ ఫ్రాన్సులు ఇందుకు అడ్డు పడవచ్చును.

కాని, ఇవి అడ్డుపడవనే విషయం హిట్లర్ ముందుగానే తెల్చుకున్నాడు. 1914-18 నాటి యుద్ధం తర్వాత అన్యా క్రాంతమైపోయిన జర్మన్ వలస రాజ్యాలు తిరిగి జర్మనీ వశం

కావాలని అతడు ఆందోళన ప్రారంభించాడు ముసోలినీ ఈ ఆందోళనను సమర్థించాడు. దీన్ని చూడగా బ్రిటన్‌కు భయం తోచింది. ముసోలినీ ఒక్కడితోనే ప్రాణాంతకంగా వుండగా అతడికి హిట్లర్ కూడా జతకూడితే ఇక చెప్పాలా? కాని, వారిద్దరూ ఏకమయేలానే కనబడుతున్నారు. స్పెయిన్ విద్రోహం విషయంలో ఇద్దరూ సహకారాన్ని నెరవుతున్నారు. ఇపుడు తిరిగి జర్మనీ వలసరాజ్యాల విషయంలో ముసోలినీ హిట్లరును సమర్థిస్తున్నాడు. అంచేత ఎలాగైనా సరే వీరిని చీల దియ్యాలి. ఇలా యోచనచేసి, 1937 మధ్యస్థంలో— అంటే, ఇంకా ముసోలినీ హిట్లర్ వద్దకు ప్రయాణం కట్టకముందే— బ్రిటిష్ ప్రభుత్వం తరఫున హాలిఫాక్సుప్రభువు (పూర్వం ఈయనపేరుఇర్విన్ ప్రభువు. ఇండియాకు వైస్రాయిగావచ్చాడు.) జర్మనీ వెళ్ళి "మాతో సఖ్యతగా వుండడానికి మీ షరతులేమిటి?" అని బేరం సాగించాడు. చివరికి ఈ బేరం తెగలేదు గాని, వలసరాజ్యాల ఆందోళన వదులుకుంటే, మధ్య యూరప్‌లో హిట్లర్ ఏ ఆటలు ఆడినా బ్రిటన్ పట్టించుకోదని హాలిఫాక్సుప్రభువు సూచించి వచ్చాడు.

దీనితో బ్రిటన్ ఆస్ట్రియా ఆక్రమణకు అడ్డుపడ దనే విషయం స్పష్టపడింది. బ్రిటన్ అడ్డుపడ దని స్పష్టపడినప్పుడు ఇక ఫ్రాన్సును ఖాతిరీచెయ్య నవసరంలేదు. స్పెయిన్‌లో ఫాసిస్టుప్రభుత్వం ఏర్పాటుకావడం ఫ్రెంచి ప్రజాస్వామికానికి అపాయకరం. అంచేత అప్రియత్నానికి ఫ్రెంచి ప్రభుత్వం

తప్పక అడ్డుపడవలసింది. కాని, అది ఆపని చేసిందా ? లేదు. బ్రిటన్ తటస్థవిధాన కపటనాటకాన్ని ఆడితే, అదికూడా దానిలో ఒకపాత్రను స్వీకరించింది. ఈరీతిగా కేవలం బ్రిటన్‌కు పక్క-తాళం వేస్తూ, తన మంచిచెడ్డల్ని తను సర్దుయించుకో లేకుండా వున్న ఫ్రాన్సు, తనంతట తానుగా ఆస్ట్రియా ఆక్రమణకు అడ్డుపడుతుందా ? అది అసంభవం.

ఈ అంతర్జాతీయ పరిస్థితుల్ని అన్నింటినీ హిట్లర్ గమనించాడు. తగిన తరుణం లభించిన దని నిశ్చయించాడు. ఆస్ట్రియాను దౌర్జన్యం చేతనైనాసరే ఆక్రమిస్తా నన్నాడు. అయితే, రైష్‌వీర్ సేనానులు దీనికి సమ్మతించలేదు. "మన సైన్యంగాని, మనదేశంగాని, ఇప్పుడు యుద్ధానికి సన్నద్ధంగా లేవు. అంచేత తొందరపాటు కూడదు" అని వా రన్నారు. ఇలా అన్నవారిని పదభ్రష్టుల్ని చేసి, హిట్లరు తాను స్వయంగానే జర్మన్ సైన్యాలకు సర్వాధికారి అయ్యాడు.

వరసగా అతడు ఇలా ప్రతిబంధకాల్ని అన్నింటినీ తొలగించుకు వచ్చాడు. ఇక, ఆస్ట్రియాపైకి దూకడమే తడవు !

## 25

"సామ దాన భేదాలచేత ఆస్ట్రియాను మన సామంత రాజ్యంగా చెయ్యవలసిన భారం నీది." అని చెప్పి హెర్ వాన్ పాపన్‌ను వియన్నాకు రాయబారిగా పంపించాడు, హిట్లరు. ఈ పనిలో పాపన్ నెగ్గలేకపోయాడు. శాయశక్తులా ప్రయత్నించి అతడు ఆస్ట్రియాతో ఒక ఒడంబడిక కుదిర్చినమాట నిజం. అయితే, ఈ ఒడంబడిక కారణంగా ఆస్ట్రియా స్వాతంత్ర్యం విలువ ప్తమై పోనూ లేదు; అది జర్మనీ సామంత రాజ్యం కానూ లేదు. దీన్ని చూడగా హిట్లరుకు పాపన్ మీాద విపరీతమైన కోపం కలిగింది. "నీవు పనికిమాలిన వాడివి; వెనక్కు తిరిగిరా!" అని కబురు పంపించాడు. కలవర పడుతూ పాపన్ బెర్ట్స్ గాడెన్‌కు— ఇది హిట్లరు నివాసం. బవేరియాలో ఒక కొండమీాదవుంది— వెళ్ళి, హిట్లరును సందర్శించాడు. ఈ సమావేశంలో ఏమిజరిగిందో తెలియదు గాని; రాయబారిఉద్యోగంనుంచి విరమించుకోవలసిన పాపన్ తిరిగి వియన్నాకు వెళ్ళి, "మా హిట్లరు మీాతో ఏవో ముఖ్య విషయాల్ని ప్రసంగించాలట! మిమ్మల్ని ఒకసారి బెర్ట్స్‌గాడెన్‌కు రమ్మన మన్నాడు" అని డాక్టర్ షూష్నిగ్‌కు సందేశాన్ని అందజేశాడు.

ఈ సందేశాన్ని అనుసరించి తాను వెళ్ళడమా, వెళ్ళక పోవడమా అని షూష్నిగ్ పెద్ద ఆలోచనలో పడ్డాడు. "తనను

రమ్మని కబురు పంపడంలో హిట్లర్ వుద్దేశమేమిటి? వెడితే ఏమి మూడుతుందో? వెళ్ళకపోతే ఏమిచిక్కు వస్తుందో? ముసోలినీని సలహా అడిగితే బాగుండును కాని, 1937 ఏప్రిల్‌లో వెన్నిస్‌లో కలుసుకున్నప్పటినుంచీ అతడు చికాకుగా వుంటున్నాడు. మొన్న మొన్ననే బర్లిన్ వెడుతూవుండగా, దారిలో వియన్నాలోకూడా ఒకరోజు ఆగమని అతడిని అడిగితే "వీలు లేదు" అని మొరటుగా జవాబు చెప్పాడు. అంచేత అతడిని సలహా అడిగి లాభంలేదు. ఇక ఫ్రాన్సు, బ్రిటన్ ప్రభుత్వాల వారినైనా సలహా చేస్తే బాగుండును. కాని, "మా ఆహ్వానం సంగతి రహస్యంగా వుంచాలిసుమా!" అని పాపన్ హెచ్చరించాడు. ఇందుకు భిన్నంగా సంచరిస్తే, పరిస్థితులు ఎలా విషమిస్తాయో తెలియదు. "ఆస్ట్రో-జర్మన్ సహకారమే మా ఆశయం. అందుకోసమే ఈ ఆహ్వానం" అని పాపన్ చెప్పాడు. ఇప్పుడు ఈ ఆహ్వానాన్ని తృణీకరిస్తే, ఆస్ట్రో-జర్మన్ సహకారానికి ఒకగొప్ప అవకాశం లభిస్తే, దాన్ని తోసిపుచ్చిన అపఖ్యాతి వస్తుందేమో?"

ఈ విధంగా రకరకాలుగా ఆలోచించి, తాను స్వయంగా ఏమీ నిర్ణయించుకోలేక, డాక్టర్ షూష్నిగ్ తన బాల్య స్నేహితుడైన డాక్టర్ స్కిమిట్ సలహాను అర్థించాడు అతడు "వెళ్ళిరావడమే, ఎందుకైనా మంచిది" అని చెప్పాడు. ఈ సలహాప్రకారం 1938 ఫిబ్రవరి 10 వ తేదీనాడు షూష్నిగ్ హిట్లర్ ఆహ్వానాన్ని అంగీకరించాడు.

తాను చేసిన వాగ్దానం ప్రకారం ఆహ్వానం సంగతిని డాక్టర్ షూష్నిగ్ రహస్యంగానే వుంచాడు. అయితే, ఎవడో ఆస్ట్రియన్ ప్రభుత్వోద్యోగి ఈ విషయాన్ని ముసోలినీకి తెలియబరచాడు తనకు తెలియకుండా హిట్లర్ ఇంతపని చేసినందుకు అతడికే నిజంగా ఆగ్రహం కలిగింది. "జర్మనీకీ, ఇటలీకీ మధ్య ప్రస్తుత మున్న సంబంధ బాంధవ్యాన్ని బట్టి ఈ విషయాన్ని ముందుగా మీరు నాకు చెప్పకపోవడం తప్పు కాదా? అని అతడు అడిగాడు. అప్పుడు పాపెన్ తమచర్యను సమర్థించుకున్న విధం యిది: "1937 అక్టోబరులో మీరు మా నాయకుడైన హిట్లరును కలుసుకున్నప్పుడు ఆస్ట్రో-జర్మనీ సహకారాన్ని గురించి చర్చించడానికి షూష్నిగ్‌తో సమాలోచన జరపడం మంచిదేమో అని సూచించారు. ఆసూచన ప్రకారమే మేము ఇపుడు ఆహ్వానాన్ని పంపించాము. అందుచేత ప్రత్యేకంగా మీకు తెలపవలసిన అవసరం లేదని భావించాము."

చాలా తెలివి తేటలతో కూడింది ఈ సమర్థన. అయితే ముసోలినీకి ఇందువల్ల సంతృప్తి కలగలేదు. హిట్లరు తనను మోసగించినట్లుగా అతడు భావించాడు. పైగా, ఆస్ట్రియా జర్మనీ వశమైపోతే, మున్ముందు ఇటలీకి ఏమి ముప్పు కలుగుతుందో అనే భయంకూడా తిరిగి బలమైంది. ఈ స్థితిలో బ్రిటన్‌తో వెంటనే సఖ్యపడి, ఆస్ట్రియా ఆక్రమణను అడ్డపడటమే కర్తవ్యంగా తోచింది ఇలా తోచడమే తడవు.—

లండన్‌లోని తమ రాయబారి సీనారు గ్రాండే పేర ఒక తంతిని పంపించాడు. ఈ తంతిలోని సారాంశం ఇది: హిట్లరు ఆస్ట్రియాను కబళించనున్నాడు. దీన్ని అడ్డుకోవాలంటే నాతో వెంటనే రాజీకి వచ్చే ప్రయత్నం చెయ్యండి ”

ఈతంతిని చూడగానే బ్రిటిష్‌ప్రధాని నెవెల్లీ ఛేంబర్లియన్ ఇటలీతో రాజీకి రావడం ఆవశ్యకమని భావించాడు. విదేశాంగమంత్రి ఆంథోనీ ఈడెన్ “ స్పెయిన్ సమస్య తేలసిదే, ఇటలీతో రాజీ ఏమిటి ? ” అన్నాడు. ఈ భేదాభిప్రాయాల కారణంగా ఈడెన్ తన పదవికి రాజీనామా పెట్టవలసి వచ్చింది.

ఈడెన్ రాజీనామా గొడవలో ఆంగ్లో – ఇటాలియన్ రాజీ సంభాషణలు ప్రారంభం కాలేదు. ఈవ్యవధిలో ముసోలినీ మనస్సు మార్చుకున్నాడు. హిట్లర్ ఆశయసిద్ధికి ఒక పెద్ద ప్రతిబంధకం తీరిపోయింది.

## 26

మరి ఎక్కడికో వెడుతున్నట్టు ప్రకటించి, ఫిబ్రవరి 12వ తేదీనాడు డాక్టరు షూష్నిగ్ బ్రెక్టెస్‌గాడెన్ చేరుకున్నాడు. అతడిని ఆహ్వానించడానికి హిట్లరు మంచి ఏర్పాటుల్నే చేశాడు. ఆ ఏర్పాట్లు ఏవంటే,– ఆస్ట్రియా సరిహద్దులలో జర్మన్ సైనిక దళాల్ని కేంద్రీకరించడం ; జర్మన్ సేనానాయకుల్నీ, ఆస్ట్రియన్ నాజీ నాయకుల్నీ బ్రెక్టెస్‌గాడెన్‌కు పిలిపించడం. తన

సహకారాన్ని కోరి పిలిపించాడుగనుక మర్యాదగా ప్రవర్తిస్తా డేమోనని షూష్నిగ్ ఆశించాడు. కాని, హిట్లరు అసహ్యంగా మాట్లాడాడు; అసభ్యంగా ప్రవర్తించాడు; ఆవేశపూరితుడై చిందులు తొక్కాడు. "నేను చెప్పినమాట వింటావా, లేదా? లేదంటే జాగ్రత్తసుమీ! నేను కనుసైగ చేస్తే చాలు; నా సైన్యాలు ఆస్ట్రియాను ధ్వంసంచేస్తాయి. రక్తపాతాన్ని కోరతావో, శాంతి భద్రతలను కోరతావో నిశ్చయించుకో!" ఈ ధోరణిలో గంటలకొద్దీ అతడు అరిచాడు. దీన్ని చూడగా "చూస్తోచూస్తో గోతిలో పడిపోయానే!" అనే బెంగ షూష్నిగ్‌ను పట్టుకుంది. కాని తప్పించుకునే దారి యేది?

"ఫాదరులాండ్ ఫ్రంట్"లో ఆస్ట్రియన్ నాజీలకు ఇతరులతోపాటు సమాన ప్రతిపత్తిని ఇవ్వాలి,—ఇది హిట్లరు పెట్టిన మొదటిషరతు. ఇక రెండవ షరతు ఇది: నాజీనాయకుడైన డాక్టరు సేయుస్ ఇంక్వార్టుకు మంత్రివర్గంలో హోం మినిస్టరు పదవిని ఇచ్చితీరాలి.

దాదాపు పదకొండు గంటలసేపు హిట్లరు షరతుల్ని విన్నమీదట "సరే! ఈవిషయంలో నాకు ఏమీ అభ్యంతరం లేదు. అయితే సేయుస్ ఇంక్వార్టును మంత్రిగా నియమించ వలసినవాడు ఆస్ట్రియా అధ్యక్షుడైన డాక్టరు మిక్లాస్. ఆయన సలహా తీసుకోవాలి. నాకు రెండు మూడు రోజులు గడువు

ఇవ్వండి” అని అడిగి, డాక్టరు షూష్నిగ్ తిరిగి చల్లగా వియన్నా చేరుకున్నాడు.

చేరుకోగానే అతడు ఆస్ట్రియన్ రిపబ్లిక్ అధ్యక్షుడైన డాక్టర్ మిక్లాస్ దగ్గిరికి వెళ్ళి, జరిగినవిషయాల్ని చెప్పి, “నేనే ఛాన్సలరుగా వుండాలంటే హిట్లర్ షరతులకు అంగీకరించండి” అని కోరాడు.

హిట్లర్ షరతులకు అంగీకరిస్తే, ఆస్ట్రియా స్వాతంత్ర్యాన్ని నష్టపరిచినట్టే! మొదటి షరతుప్రకారం “ఫాదరు లాండుఫ్రంట్”లో నాజీలకు తక్కినవారితోపాటు సమాన ప్రతిపత్తి లభిస్తుంది. అంటే, ఏ నాజీల బారినుంచి ఆస్ట్రియా స్వాతంత్ర్యాన్ని కాపాడాలని డాక్టరు డోల్ఫుస్ “ఫాదరు లాండ్ ఫ్రంటు” ఉద్యమాన్ని ప్రారంభించాడో, ఆ ఉద్యమం లోనే నాజీలకు ప్రవేశం కలుగుతుంది! ఇక రెండవషరతు ప్రకారం నాజీనాయకుడు ఒకడు నాజీ ప్రచారంనుంచీ, నాజీ విద్రోహంనుంచీ, నాజీ దౌర్జన్యంనుంచీ దేశాన్ని కాపాడ వలసిన పోలీసుశాఖకు అధిపతి అవుతాడు!! దొంగకు ఇనప పెట్టి తాళంచెవి అప్పగించడం ఇంతకంటె తెలివితక్కువపని కాదు. ఈ అపాయాన్ని ఆలోచించి నేను ఈ షరతుల్ని అంగీకరించనని డాక్టరు మిక్లాస్ తెలియబరిచాడు.

“మీరు అంగీకరించకపోతే, మరి నా రాజీనామాను తీసుకోండి!!” అని డాక్టరు షూష్నిగ్ అన్నాడు. ఆ రాజీ

నామాను అందుకుని, ప్రెసిడెంట్ మిక్లాస్ వియన్నాపురపాలక సంఘాధ్యక్షుడైన రిచర్డు స్కీమిడ్జేను పిలిపించి, "మీరు ఛాన్సలరుపదవిని స్వీకరిస్తారా?" అని అడిగాడు. స్కీమిడ్జే "ఈభారాన్ని నేను భరించలేను" అన్నాడు. అంతట తిరిగి డాక్టరు షూష్నిగ్‌నే ఛాన్సలరుగా వుండమని కోరవలసివచ్చింది. ఇంతేకాదు. డాక్టరు సేయుస్ ఇన్‌క్వార్టును హోం మినిస్టరుగా నియమించవలసివచ్చింది కూడా!

ఫిబ్రవరి 15వ తేదీనాడు ఇన్‌క్వార్టు మంత్రిపదవిని స్వీకరించాడు; ఫిబ్రవరి 16 వ తేదీనాడు ఆజ్ఞల్ని స్వీకరించాడని కాబోలు, తన యజమాని అయినట్టి హిట్లరుదగ్గరికి ప్రయాణం కట్టినాడు!

## 27

తన కార్యంసానుకూల పడిందని హిట్లరు చాలాసంతోషించాడు. ఫాదర్‌లాండు ఫ్రంటులో నాజీలకు ప్రవేశం కలిగింది. ఆంతరంగిక రాజకీయాలను దాదాపుగా "కంట్రోల్" చెయ్యగల హోంమినిస్టర్ పదవి నాజీనాయకుడికి లభించింది. ఇక తాను అనతికాలంలో ఆస్ట్రియాకు నాథుడు కావడానికి ప్రతిబంధకం ఏ ముంటుంది?

ఇంతకు పూర్వంకంటె విరివిగా—ఇప్పుడు బాహాటంగా కూడా— తన ప్రచారాన్ని సాగించవచ్చును. తన పరిపాలన

లోకి వస్తే శాంతి సుభిక్షాలు సంప్రాప్తమౌతాయనే భ్రమను కలిగించవచ్చును. ప్రచారంద్వారా ప్రజాభిప్రాయాన్ని సుముఖంగా చేసుకున్న తర్వాత "జర్మనీతో చేరిపోవడం మీకు ఇష్టమేనా?" అని వోటు తీసుకోవచ్చును. ముప్పాతిక మూడు వీసాలు "ఇష్టమే" అని మెజారిటీవస్తుంది. అలా రాదని సందేహంతోస్తే, పోలీసుశాఖ చేతిలోనే వున్నది. గనక అవసరమైన కట్టుదిట్టాల్ని చెయ్యవచ్చును ఇలా ఆలోచించి ఆస్ట్రియా తన గుప్పిటిలోకి వచ్చినట్టే హిట్లరు పొంగిపోయాడు. ఫిబ్రవరి 20 వ తేదీనాడు ఉపన్యసిస్తూ, తన ఈ ఆనందాన్ని అతడు బహిరంగంగా ప్రకటించాడుకూడా!

ఇక, డాక్టర్ షూష్నిగ్ జరిగిన పనికి విచారించసాగాడు. తీరా డాక్టర్ సేయిస్, ఇంక్వార్టును హోం మినిస్టరుగా నియమించిన తర్వాత, ఆనియామకాన్ని కోరడంలో హిట్లరు చేసిన గూఢాలోచన అతడు తెలుసుకున్నాడు. ఇలా తెలుకుని, ఆస్ట్రియా స్వాతంత్ర్యంవిలుప్తమైపోయే సందర్భం ఏర్పడిందనీ, త్వరలో తోడ్పడకపోతే ముప్పుతప్పదనీ అతడు బ్రిటన్, ఫ్రెంచి, ఇటాలియన్ ప్రభుత్వాలకు తెలియబరిచాడు. ఆ ప్రభుత్వాలవారు ఎట్టి సలహానిచ్చారో, ఏమి సహాయాన్ని చేస్తామన్నారో తెలియదు గాని, ఫిబ్రవరి 24 వ తేదీనాడు ఆస్ట్రియా స్వాతంత్ర్యాన్ని కాపాడ్డానికి తాను కృతనిశ్చయుడై యున్నట్టు బహిరంగోపన్యాసం ద్వారా ఛాన్సలరు షూష్నిగ్

ప్రకటించాడు. ఈ ప్రకటన ఆస్ట్రియాస్వాతంత్ర్యాన్ని అభిల షించే వారిలో ఎంతటి ఉత్సాహాన్ని కలిగించిదో ఆస్ట్రియన్ నాజీలలో అంతటి ఉద్రేకాన్ని రేకెత్తించింది. వారు ఫిబ్రవరి 27 వ తేదీనాడు గ్రాజ్‌లో పెద్ద నిరసన సభ చేశారు. ప్రతి కూల ప్రదర్శనాలను జరిపారు; ప్రజాశాంతికి భంగకరంగా ప్రవర్తించారు. అపుడు ఆ నగరంలో శాంతిని కాపాడ్డానికి డాక్టరు షూష్నిగ్ సైన్యాలను పంపించవలసి వచ్చింది.

గ్రాజ్ సంఘటనల తర్వాత షూష్నిగ్‌కు ఈక్రింది ఆలోచన తోచింది: కొంతకాలం గడిచిన తర్వాత "జర్మనీతో చేరిపోవడం మీకు సమ్మతమా, కాదా?" అని ప్రజల వోటింగ్ తీసుకోవాలని— దీన్ని "ప్లెబిసైట్" అని అం టారు— హిట్లరు ఎత్తువేస్తున్నాడు. అప్పటికి పరిస్థితులు ఎలా మారతవో తెలియదుగాని, ఇప్పుడు మాత్రం నూటికి దాదాపు అరవై మంది "జర్మనీలో చేరవద్దు" అనే ధోరణిలోవున్నారు. అంచేత ముందు ఎప్పుడో ప్లెబిసైట్ జరిపించడానికి హిట్లరుకు అవకాశం ఇవ్వకుండా, ఆపని ఇపుడు నేనే చేసివేస్తే, చిక్కు తీరిపోతుంది ఇందుమూలంగా, హిట్లర్ ముందెపుడో నామీద ప్రయోగింపజూస్తున్న అస్త్రాన్ని ముందుగా నేనే అతడిమీద ప్రయోగించినట్లు అవుతుంది.

ఈ ఆలోచన ప్రకారం ఫిబ్రవరి 9వ తేదీనాడు డాక్టరు షూష్నిగ్ ఇన్స్‌బ్రిక్ అనే ప్రదేశం నుంచి, వచ్చే ఆదివారం

నాడు (మార్చి 13వ తేదీనాడు) "ఆస్ట్రియా స్వతంత్రంగా వుండాలా, లేదా ?" అనే ప్రశ్నపై ప్లెబిస్సైట్ జరువుతా నని ప్రకటించాడు. ఈ ప్లెబిస్సైట్‌లో ఇరవైనాలుగు సంవత్సరాలకు పైగా వయస్సువున్నవారందరూ పాల్గొనవచ్చునని అతడు అన్నాడు. ఇలా ఒకవయస్సు పరిమితిని పెట్టడంలో అతడికిగల వుద్దేశం ఇది: నాజీపార్టీకి చెందిన వారిలో అధిక సంఖ్యాకులు యువకులు. అంచేత ఇరవైనాలుగు సంవత్సరాలైనా వయస్సులేనివారు వోటుచెయ్యకూడదని నియమిస్తే చాలామంది నాజీలకు అసలువోటు చెయ్యడానికే వీలుండదు.

ప్లెబిస్సైట్ ప్రకటిస్తూడాక్టర్ షూష్నిగు రేడియోఉపన్యాసాన్ని చేశాడు. ఆస్ట్రియా స్వాతంత్ర్యాన్ని కాపాడ్డానికి నాకుగల తుది అవకాశం ఇదే అనేభావం అతడిని ప్రోత్సహించింది కాబోలు, అతడు ఆ వుపన్యాసంలో అపూర్వమైన ధైర్యాన్ని ప్రకటించాడు. ఇంతకుమించిన విశేషం ఏమంటే,—అతడు వక్త కాడు; అయినప్పటికీ ఆ ఉపన్యాసం ఎంతటి వక్త అయినా సరే గర్వపడదగినరీతిగా వుంది. హేళనగాని, ఎత్తిపొడుపుగాని, షూష్నిగ్‌కు చేతనైనవిద్య అని అంతకుపూర్వం ఎవ్వరికీ తెలియదు. కాని, ఆ ఉపన్యాసములో అతడు హిట్లరును చాలా చక్కగా హేళనచేశాడు. ఎంతో బాగా యెత్తిపొడిచాడు. అతడి ఉపన్యాసంలోని కొన్ని భాగాలు ఇవి:

"పెద్దపెద్ద ఉపన్యాసాలు ఇవ్వడంగాని, గొంతు చించుకొని అరవడంగాని నాకు చేతకాదు" (హిట్లర్ ఈపనులు చేస్తాడు.)

"మాతృదేశభక్తిని వ్యక్తిపరంగాగాని, వ్యక్తిపరమైన ప్రభుత్వంద్వారాగాని పెంపొందించడం నావుద్దేశంకాదు" (ఇది కూడా హిట్లరుమీద దెబ్బే!)

"ప్లెబిస్సైట్ జరపండి అని చాలాసంవత్సరాలనుంచి మనల్ని ఛాలెంజిచేస్తున్నారు. స్వతంత్రరక్షణకు మనం సంసిద్ధంగా వున్నామని నిరూపించవలసిన సమయం వచ్చింది. ఆదివారంనాడు ఆస్ట్రియన్ ప్రజల విజయంమీదనే నేను పరిపాలన సాగించడమా, లేక రాజీనామా ఇవ్వడమా అనే విషయం ఆధారపడివుంటుంది."

ఈ ఉపన్యాసానికి హిట్లరు తెల్లబోయాడు! ఆశ్చర్యం, ఆగ్రహం, ఆవేశం అతడిని కంపించి వేశాయి.

## 28

తొమ్మిదవ తేదీనాడు డాక్టర్ షూష్నిగ్ ప్లెబిస్సైట్ ప్రకటన చేశాడు. పదకొండవ తేదీవరకూ ఆస్ట్రియన్ నాజీలకు హిట్లర్ వద్దనుంచి ఆజ్ఞలు రాలేదు. తలవని తలంపుగా డాక్టర్ షూష్నిగ్ ప్లెబిస్సైట్ ప్రకటించాడేమో, హిట్లరుకు

కర్తవ్యం పాలుబోలేదు. దీన్ని సాకుగాపెట్టుకొని ఆస్ట్రియాపైని దూకడమా, దూకక పోవడమా? దూకితే, బ్రిటన్ ఫ్రాన్సుల వైఖరి ఎలావుంటుంది? అవి జోక్యం కలుగజేసుకుంటాయా? లేక "మీచర్యను మేము తీవ్రంగా నిరసిస్తున్నాము" అనే కబురుతో సరిపెట్టుకుపోతవా? హిట్లరు ఈ ఆలోచనలతో కలవర పడుతూండగా, ఆస్ట్రియన్ నాజీలు ఏమి చెయ్యడానికీ తోచక, తమకు సులభమైన పని గనక డాక్టరు షూష్నిగ్ ప్రకటనను ఖండిస్తూ వియన్నాలో కొంత అల్లరి చేశారు. వీరిలో మరీ అల్లరి చేసినవారిని కొందరిని తొమ్మిది, పది తేదీలలో షూష్నిగ్ అరెస్టు చేయించాడు.

తదేకంగా దాదాపు సలభై ఎనిమిది గంటలసేపు యోచన చేసిన మీదట "ఇది మంచి తరుణం; ఆస్ట్రియాను ఇపుడు వశపరచుకు తీరవలసి దే!" అని హిట్లర్ నిర్ణయించుకున్నాడు.

ఇంతకు పూర్వం అడ్డుపడ్డట్టు ఇపుడు ఇటలీ అడ్డు రావడం కల్ల.

ఇక, ఫ్రాన్సులో ఛాతంమ్స మంత్రివర్గం రాజీనామా యిచ్చింది. దాని స్థానంలో కొత్తమంత్రివర్గం ఇంకా ఏర్పడ లేదు. అది సులభంగా ఏర్పడగల సూచనలుకూడా లేవు. అంచేత ఈ స్థితిలో ఫ్రాన్సు జోక్యం కలగజేసుకోవడంగాని, జోక్యం కలగజేసుకున్నా నెగ్గడంగాని దుస్సాధ్యం.

పోతే, బ్రిటన్ సంగతి: ఫేసిస్టు, నాజీ ప్రభుత్వాలకు ప్రతికూలత చూపుతున్న ఈడెన్ విదేశాంగమంత్రిపదవి నుంచి తప్పుకున్నాడు అతడి స్థానంలో జర్మనీ అంటే ఇంతో అంతో అభిమానాన్ని చూపించే హాలిఫాక్సు ప్రభువు విదేశాంగమంత్రి అయ్యాడు. పోయిన సంవత్సరం బర్లిన్ నగరానికి వచ్చి, ఇతడు "జర్మనీ వలసరాజ్యాల ఆందోళనను కట్టిపెడితే, మధ్యయూరప్‌లో అది ఏ ఆటలు ఆడినా బ్రిటన్ పట్టించుకోదు" అని సూచించాడు. అంచేత బ్రిటన్ పక్షం నుంచి ప్రాతికూల్యాన్ని ఎదుర్కొనవలసి వుండదు. ఇంతకూ బ్రిటన్ కోరుతున్నది స్వసామ్రాజ్యరక్షణ. అందుకు భిన్నం రానంత వరకూ ఆస్ట్రియా మొదలైన చిన్నచిన్న రాజ్యాలు ఏ గడ్డి కరిచినా అది యుద్ధానికి దిగదు. ఒకవేళ యుద్ధానికి దిగాలని అనుకున్నప్పటికీ, దాని ఆయుధసమీకరణ కార్యక్రమం పూర్తికాలేదు. అంచేత దానికి అంతగా భయపడవలసిన అవసరంలేదు.

పరిస్థితులు ఇంత అనుకూలంగా వుంటే, మరి సంకోచం దేనికి? సరుక్కువెడదామని నిశ్చయించుకున్నాడు, హిట్లరు!

## 29

అంతకుపూర్వం చాలారోజులనుంచి జర్మన్ సైన్యాలు ఆస్ట్రియన్ సరిహద్దులలో సిద్ధంగావున్నాయి. ఈ సైన్యాలకు తోడుగా మార్చి 10 వ తేదీ రాత్రి హిట్లర్ మరికొన్ని సైన్యాలను పంపించాడు. ఇలా సన్నద్ధపడి 11 వ తేదీ ఉదయం అతడు ఆస్ట్రియాకు రెండు అంత్య సందేశాల్ని ('అల్టిమేటమ్స') పంపించాడు. వీటిలో మొదటిది,— డాక్టర్ షూష్నిగ్ ప్రకటించిన ప్లెబిసైట్‌ను ఉపసంహరించాలని ఇక రెండవది,— డాక్టర్ షూష్నిగ్ ఛాన్సలర్ పదవికి రాజీనామా పెట్టాలని. ఈ రెండు అంత్యసందేశాలు చేరగానే, షూష్నిగ్ బ్రిటన్, ఫ్రెంచి, ఇటాలియన్ ప్రభుత్వాలకు "ఈ విపత్తులో ఆస్ట్రియాకు తోడ్పడండి" అని విజ్ఞాపన పంపుకున్నాడు.

బ్రిటిష్ ప్రభుత్వానికి షూష్నిగ్ విజ్ఞాపన అందినవేళకు హెర్ వాన్ రిబ్బన్‌ట్రాప్ లండన్‌లో వుండడం తటస్థించింది. ఇతడు అంతకు పూర్వం జర్మన్ ప్రభుత్వంతరఫున లండన్‌లో రాయబారిగా వుంటూవుండేవాడు. ఈ హోదాలో ఇతడు హిట్లర్ అభిమానాన్ని సంపాదించుకున్నాడు. దీని ఫలితం ఏమంటే,—బారన్ వాన్ న్యూరత్ స్థానంలో ఇతడు జర్మనీ విదేశాంగమంత్రిగా నియుక్తుడు కావడం. కొత్తపదవిని స్వీకరించిన తర్వాత, లండన్‌లో తన సహోద్యోగులుగా పని చేసినవారివద్ద సెలవు పుచ్చుకోవడం కోసం ఇతడు అక్కడికి

వచ్చాడు. ఇక ఇప్పుడు అసలు విషయం ఇది: డాక్టర్ షూష్నిగ్ విజ్ఞాపన అందగానే బ్రిటిష్ విదేశాంగ మంత్రి రిబ్బన్ ట్రాప్‌కు కబురుచేశాడు అప్పటి కప్పుడే స్వదేశానికి తిరిగి వెళ్ళడానికి రిబ్బన్ ట్రాప్ ప్రయాణమై వున్నాడు అతడి విమానం క్రాయిడన్ విమానాశ్రయంలో సిద్ధంగా వున్నది: "నాకు వ్యవధి లేదు; వెళ్ళిపోవాలి" అని రిబ్బన్ ట్రాప్ అన్నాడు గాని, బలవంతంమీద హాలిఫాక్సు ప్రభువు అతనిని ఆపుచేశాడు. ఇలా ఆపుచేసి, ఆస్ట్రియా ఆక్రమణను బ్రిటన్ ఆమోదించదని ఖండితంగా చెప్పాడు. ఈ సంగతిని రిబ్బన్ ట్రాప్ హిట్లరుకు టెలిగ్రాఫ్ చేశాడు: "ఇది మా వ్యవహారం. బ్రిటన్‌కు దీనితో సంబంధంలేదు. దాన్ని నోరుమూసుకో మను!" అన్న ధోరణిలో హిట్లర్ జవాబును పంపించాడు. ఈ జవాబును అక్షరాల హాలిఫాక్సుప్రభువుకు అందజేసి, రిబ్బన్‌ట్రాప్ ప్రయాణమై వెళ్ళిపోయాడు.

ఈ లోపుగా ప్యారిస్‌లో పుట్టిన కలవరం ఇంతంతకాదు. అయ్యో! ఆస్ట్రియా అంతరించిపోతున్నదే అనే ఆందోళన ఒకవైపు! మనం అడ్డుపడలేముగదా అనీ, కనీసం ఈ విపత్సమయంలో మనకు ఒక ప్రభుత్వమైనా లేకపోయెనుగదా అనీ ఆ వేదన ఒకవైపు. ఈస్థితిలో ఏమీ తోచక "బ్రిటన్ తప్పక జోక్యం కలిగించుకోవాలి. హిట్లర్‌ను ప్రతిఘటించా[illegible] ప్యారిస్‌నుంచి బ్రిటిష్‌ప్రభుత్వానికి వర్తమానా[illegible]

## ఆస్ట్రియా ఆక్రమణ

ఆదివరకే హిట్లర్ పంపిన జవాబుకు చాలా కించపడివున్న బ్రిటిష్ ప్రభుత్వవర్గానికి ఈ వర్తమానాలు కోపకారణమైనవి. "ఆస్ట్రియా సంగతి తర్వాత ఆలోచించవచ్చు! ముందు ఫ్రాన్సుకు ఒక మంత్రివర్గాన్ని సంపాయించుకోండి!" అని వారు ఎత్తిపొడిచారు. మామూలు పరిస్థితిలో త్వరగా మంత్రి వర్గనిర్మాణం జరిగేదికాదేమో గాని, ఆస్ట్రియాకు తటస్థించిన విపత్తువల్లను, బ్రిటన్ ఎత్తిపొడుపు వల్లను వెంటనే ఈ పని జరిగింది. లియాన్ బ్లుం 13 వ తేదీనాటికి తిరిగి పాపులర్ ఫ్రంట్ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశాడు. అయితే, ఈ లోపుగానే హిట్లర్ లోహపుపాదాల క్రింద ఆస్ట్రియా నలిగిపోయింది.

ఇక, ఇటలీని గురించి రెండు ముక్కల్ని చెప్పాలి. అదే రెండు, మూడు నెలలక్రితమైతే ముసోలినీ ఆస్ట్రియా ఆక్రమణను తప్పక ప్రతిఘటించేవాడు! హిట్లర్ ఏదో వొక సాకు కల్పించుకొని ఆస్ట్రియామీదికి దూకడానికి సన్నద్ధపడుతున్నాడని ఖాయంగా తెలియగానే— ఇంతకు పూర్వం వివరించినట్టు— ముసోలినీ బ్రిటిష్‌ప్రభుత్వంతో తనతగవును పరిష్కరించుకోడానికి ప్రయత్నించాడు. అదే సమయంలో అతడు ఫ్రెంచి ప్రధాని లియాం బ్లుంకు కూడా "హిట్లర్ సెంట్రల్ యూరప్ అంతటినీ తన ఆధిపత్యం క్రిందకి తెచ్చుకో [illegible] చూస్తున్నాడు. ఆలస్యం జరిగితే ముప్పు తప్పదు. [illegible]న్సు, ఇటలీ రాజ్యాలు ఏకమై అతడిని ఇప్పుడు

,ాలి" అ~
ఆస్ట్రియాలు వెళ్ళాయి.

ప్రతిఘటించాలి. నా అబిసీనియా విజయాని
దిస్తే చాలు,—తక్కిన విషయతులకైనా లో
రాజీకి వస్తాను" అని కబురు పంపించాడు
బ్లం ఈ కబురును పెడచెవిని పెట్టాడు. ...
ధోరణిని పూర్తిగా మార్చుకున్నాడు.

ఇందుకు తోడు ఆస్ట్రియాకు అంత్యసందేశం అంద జేస్తూనే, హిట్లర్ ముసోలినీకి ఒక ఉత్తరాన్ని పంపించాడు. ఈ ఉత్తరంలో ఇటలీ విపత్తులో వుండగా జర్మనీ అవలంబించిన వైఖరిని— అంటే, ఆంక్షన్నును ప్రకటించని సంగతిని— మరవ వద్దనీ, జర్మనీ సరిహద్దు శాశ్వతంగా బ్రెన్నర్ పాస్‌ను మించ దనీ, తాను దేవుడిముఖం చూచి వాగ్దానం చేస్తున్నాననీ అతడు వ్రాశాడు. దీన్ని చూచుకున్నమీదట "మరి నేను తాటస్థ్యాన్ని వహిస్తాను" అని ముసోలినీ నిశ్చయించు కున్నాడు.

ఇటాలియన్ డిక్టేటర్ అవలంబించిన ఈ వైఖరిపట్ల తన కృతజ్ఞతను తెలుపుతూ మార్చి 13 వ తేదీనాడు హిట్లర్ ఈ సందేశాన్ని పంపించాడు. "నేను ఈ మేలును ఎన్నటికీ మరవను."

# 30

మార్చి 11వ తేదీ శుక్రవారం ఉదయం జర్మనీనుంచి ప్రెసిడెంట్ మిక్లాస్ దగ్గరికి ఈ సందేశం వచ్చింది: మూడు గంటలలోపుగా ప్లెబిస్సైట్‌ను రద్దుపరచాలి; డాక్టర్ షూష్నిగ్ రాజీనామా పెట్టాలి. లేకపోతే, మేము తగినచర్యను జరప వలసి వస్తుంది. ఈ సందేశం అందగానే ప్రెసిడెంట్ మిక్లాస్ షూష్నిగ్‌తో సంప్రతించి ప్లెబిస్సైట్‌ను రద్దుచేయించాడు. కాని, హిట్లర్‌కు అంతటితో సంతృప్తి కలగలేదు. వెంటనే అతడు ఇంకొక సందేశాన్ని పంపించాడు. దీనిలోని షరతులు ఇవి: గంటన్నర లోపుగా ఛాన్సలర్ షూష్నిగ్ రాజీనామా ఇవ్వాలి; ఆ పదవి డాక్టర్ సీయుస్ ఇంక్వార్టుకు చెందాలి; నాజీ పక్షానికి మూడింట రెండువంతులు మెజారిటీతో క్రొత్త మంత్రి వర్గాన్ని ఏర్పాటు చెయ్యాలి; ఆస్ట్రియన్ నాజీలను స్వదేశానికి తిరిగి రానిచ్చి, రాజధాని నగరం (వియన్నా) లో శాంతి కాపాడవలసిన పనిని వారికి అప్పజెప్పాలి; నాజీపార్టీ మీద సమస్తనిషేధాలు తొలగిపోవాలి ఈ రెండవసందేశం అందేవరికే బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీలలో దేనినుంచి కూడా సహాయంరా దనే విషయం స్పష్ట పడిపోయింది. ఇక రాజీనామాయే గతి అని తోచింది. ఛాన్సలర్ షూష్నిగ్ ఆపనిని చేశాడు. షూష్నిగ్ రాజీనామాను అంగీకరిస్తూ ప్రెసిడెంట్ మిక్లాస్ "మేము దౌర్జన్యానికి లొంగిపోవలసి వచ్చింది"

అని ప్రకటించుకున్నాడు. ఆ ప్రకారం డాక్టర్ షూష్నిగ్ రేడియోద్వారా కింది ప్రకటన చేశాడు.

"ఈ నాడు మేము ఒక క్లిష్టమైన, విషమమైన సమస్యను ఎదుర్కొనవలసి వచ్చింది. ఈనాడు జరిగిన విషయాల్ని ఆస్ట్రియన్ ప్రజలకు తెలియబరచడానికి నేను అనుజ్ఞను పొందాను.

"కాలపరిమితిని పెట్టి జర్మన్ ప్రభుత్వం ఆస్ట్రియన్ అధ్యక్షునికి ఒక అంత్యసందేశమును పంపించింది. ఈ అంత్య సందేశం ప్రకారం ఆయన జర్మనీ ఆజ్ఞల్ని అనుసరించి కొత్త మంత్రివర్గాన్ని ఏర్పాటు చెయ్యాలి. ఇలా చెయ్యని పక్షంలో పెట్టిన గడువుదాటేనరికి జర్మన్ సైన్యాలు ఆస్ట్రియాపై దాడి జరుపుతవి.

"కార్మిక వివాదాలు ప్రబలినవనీ, రక్తనదివంతులు ప్రవహిస్తున్నవనీ, ప్రభుత్వం శాంతిభద్రతలను కాపాడకుండా వున్నదనీ, పరిస్థితులు తల మించి పోయినవనీ, ఆస్ట్రియాలో ప్రచారమౌతున్న వదంతులు మొదటినుంచి చివరివరకూ కల్పితమైనవని ప్రపంచంముందు ఉద్ఘోషిస్తున్నాను.

"మేము దౌర్జన్యానికి లొంగిపోయామని ఆస్ట్రియా ప్రెసిడెంట్ నన్ను ప్రకటించమన్నాడు.

"ఈ విపత్సమయంలో కూడా జర్మన్ రక్తాన్ని స్రవింపజెయ్యడం మాకు ఇష్టంలేదుగనకనే, మేము జర్మన్ సైన్యాలు

నిజంగా దండెత్తి వచ్చినప్పటికీ వాటిని ప్రతిఘటించవద్దనీ, భావి నిర్ణయాలకు వేచి వుండ వలసిందనీ, సైనిక దళాలకు ఉత్తర వులను పంపించాం.

"మరి, నాకు సెలవా? ఈ సమయంలో ఆస్ట్రియన్ ప్రజల వద్దనుంచి సెలవుపుచ్చుకు వెళుతున్నాను. నా మనో వాంఛ ఇది: పరమేశ్వరుడు ఆస్ట్రియాను రక్షించుగాక!"

ఛాన్సలర్ షూష్నిగ్ పదవీ పరిత్యాగం చెయ్యగానే, డాక్టర్ సేయుస్ ఇన్‌క్వార్టు కొత్తమంత్రి వర్గాన్ని ఏర్పరిచాడు. ఈ మంత్రి వర్గాన్ని గురించిన వివరాలు ఇవి:

డాక్టర్ సేయుస్ ఇన్‌క్వార్ట్: ఛాన్సలర్, రక్షణమంత్రి; హెర్ గ్రియిజీ-హెన్‌స్టెను: వైస్‌ఛాన్సలర్; హెర్ విల్‌హెల్‌వైస్ట్: విదేశాంగమంత్రి; హెర్ ఫ్రాంజ్ హుబర్: న్యాయ శాఖామంత్రి; హెర్ మెన్‌ఘిన్: విద్యాశాఖామంత్రి; హెర్ జూలీ: సాంఘికశాఖామంత్రి; హెర్ రైన్‌థాలర్: వ్యవసాయశాఖామంత్రి; హెర్ ఫిష్‌బోక్: వాణిజ్యశాఖామంత్రి; డాక్టర్ స్కూబల్: సెక్రిటరీ ఆఫ్ స్టేట్.

తన ఈ కొత్త మంత్రివర్గం ఏర్పాటు చేశాక డాక్టర్ ఇన్‌క్వార్ట్ జర్మనీకి ఒక తంతివార్తను పంపించాడు. దాని సారాంశం ఇది: "ఆస్ట్రియాలో శాంతి భద్రతలను ఏర్పరచ డానికి మేము కృషిచేస్తున్నాము. ఈ కృషిలో తోడ్పడ్డానికి మాకు జర్మన్‌సైన్యాల సహాయాన్ని పంపించ మని మనవి."

ఈ మనవి కేవలం లోకాన్ని మోసపుచ్చడానికే అని చెప్పాలి. ఎంచేతనంటే,—ఇన్‌క్వార్టు మనవి చదువుకొనకమునుపే జర్మన్ సైన్యాలు ఆనాటిపునయుం పదిగంటల ప్రాంతాన ఆస్ట్రియన్ సరిహద్దులలో అనేకచోట్ల ప్రవేశించాయి! ఇక ఆనాయంత్రానికి రెండున్నర లక్షల జర్మన్ సైనికులు ఆస్ట్రియాను వశపరుచుకున్నారు. ఆరువందల జర్మన్ యుద్ధవిమానాలు విజయఝాంకారాలను చేస్తూ ఆస్ట్రియాలో వాలినవి.

జర్మనీనుంచి సైన్యాలు వచ్చిపడగానే ఆస్ట్రియన్ నాజీలు మరింత చెలరేగిపోయారు. ప్రెసిడెంట్ మిక్లాస్‌ను రాజీనామా పెట్టవలసిందని వాళ్ళు బలవంతంచేశారు; డాక్టర్ షూష్నిగ్‌ను అరెస్టుచేశారు; పూర్వపు మంత్రివర్గానికి చెందిన ఇతరులను, సోషల్ డెమోక్రాటిక్ పక్షానికి చెందిన వాళ్ళను, దొరికినంతవరకూ బందీలను చేశారు.

ఇంతవరకు ఆస్ట్రియా స్వతంత్రరాజ్యమే నన్నట్టు, ఆ స్వతంత్రరాజ్యపు ఛాన్సలర్ విన్నపాన్ని ఆదరించి జర్మన్ సైన్యం శాంతి సంస్థాపనకు తోడవుతున్నట్టు నటన జరిగింది. శుక్రవారంనాడు జరిపిన ఈ నటన శనివారం నాటికి అనవసరమని తోచింది. అంచేత ఆస్ట్రియా జర్మనీలో కలిసిపోయినట్టు శాసనాన్నిచేసి ప్రకటించవలసిందని హిట్లర్ ఆజ్ఞాపించాడు. ఆ ఆజ్ఞలను శిరసావహించి ఇన్‌క్వార్ట్‌మంత్రివర్గం ఆస్ట్రియన్ ఫెడరల్ రాజ్యాంగ విధానం కింద తనకుగల ప్రత్యేక అధికా

రాన్ని వినియోగించుకొని ఒకశాసనాన్ని చేసింది. ఈ శాసనం లోని మొదటిషరతు ప్రకారం ఆస్ట్రియా జర్మనీ రాజ్యంలో ఒకరాష్ట్రమైపోయింది; రెండవ షరతుప్రకారం ఏప్రిల్ 10 వ తేదీనాడు జర్మనీతో ఐక్యతను గురించి ప్లెబిస్సైట్ జరగాలనీ, దీనిలో ఇరవై సంవత్సరాలకుపైగా వయస్సుగల స్త్రీపురుషు లందరూ వోటు చెయ్యడానికి వీలున్నదనీ నిర్ణయమైంది.

జర్మన్ సైన్యాలు ఆస్ట్రియాలో ప్రవేశించకముందు ఈ ప్లెబిస్సైట్‌ను జరిపినట్టయితే నూటికి కనీసం అరవై మంది అయినా "జర్మనీతో మనకు ఐక్యత వద్దు" అని వోటుచేశే వారేమో! ఇక ఇప్పుడు నూటికి ఒక్కడైనా అలా చేయ డానికి వీలులేదు. ఒకవేళ సాహసించి ఎవడైనా ఆవనిచేశాడా, ప్రహారణాలు తప్పవు. కేవలం ప్రహారణాలతోనే సరిపోదు,— కఠోర నరకాన్ని కూడా అనుభవించవలసి వస్తుంది!!

## 31

శనివారం నాటి వుదయం హిట్లర్ స్వయంగా ఆస్ట్రియాలో ప్రవేశించాడు. ప్రవేశించి, సరాసరిగా అతడు తన జన్మస్థానమైన లియాన్‌డింగ్ అనే ప్రదేశానికి వెళ్ళాడు. అక్కడ తన తల్లిదండ్రుల సమాధి దగ్గర పూజ జరిపిన మీదట అతడు ఇలా ఉపన్యసించాడు :

"ఈ పట్టణాన్నుంచి మొట్టమొదటిసారిగా బయలు దేరి వెళ్ళినప్పుడు నాజన్మభూమిని జర్మనీ మహారాజ్యంలో ఐక్యపరచడం, భగవదాయత్తమైన నాధర్మమని నాకు తోచింది. ఆధర్మాన్ని ఈ నాడు నిర్వర్తించుకున్నాను."

తర్వాత బుధవారం నాడు అతడు వియన్నా చేరు కున్నాడు. అక్కడకూడా ఇదే ధోరణిలో ఉపన్యసిస్తూ "ఇది నాజీవిత చరిత్రలో అతిమహత్తరమైన దినం" అని అతడన్నాడు. నిజమే! అతని జీవిత చరిత్రలో ఇది మహత్తర దినమే! కాని, ఆస్ట్రియా చరిత్రలో? ప్రపంచ చరిత్రలో? ఈ ప్రశ్నలకు ప్రత్యుత్తరం కోసం ఎంతోకాలం వేచివుండవలసిన అవసరం లేదు. హిట్లరు అడుగుపెట్టిన వెంటనే ఆస్ట్రియాలో బయ ల్దేరిన హాహాకారాలు "ఇది మహాదుర్దినం" అనే ప్రత్యుత్త రాన్ని ఘోషించినవి.

## 32

హిట్లరు ఆస్ట్రియాలో ప్రవేశించినట్టువినగానే మేజరు ఫే ఆత్మహత్య చేసుకున్నాడు. కేవలం తాను చావడమే కాదు; తను చావడానికి ముందు ఇతడు తన ఇల్లాలిని, పధ్నాలుగుఏళ్ళ కొడుకును, చివరకు తమ పెంపుడు కుక్కను కాల్చివేశాడు.

గాట్ఫ్రియిడ్ కుర్ట్ వాల్ట్— ఈయన న్యాయశాస్త్రం లోనూ, అర్థికశాస్త్రంలోనూ గొప్పపండితుడు; ఛాన్సలరు

సైవల్ కు ఆర్థికవ్యవహారాలలో సలహాదారుడుగా కూడా పని చేశాడు— పక్షవాతంవల్ల కాళ్ళుపడిపోయి మంచంపట్టినవాడు కూడా, విషం పుచ్చుకొని ప్రాణం తీసుకున్నాడు.

హెర్ రైట్ లింగర్ అనే పారిశ్రామికవేత్త కూతుర్ని పిలిచి "రివాల్వరుతో నన్ను కాల్చివెయ్యి" అని కోరాడు. కాదనలేక ఆవిడ ఆపనిచేసి, తర్వాత తనను తాను కాల్చేసు కుంది.

ప్రముఖులలో ఆత్మహత్య చేసుకున్నది వీరైతే, నిస్పృహతో యీకృత్యానికి దిగిన సామాన్యజనుల సంఖ్యకు అంతం లేదు. మార్చి 12 మొదలు 22 లోగా— ఒక్క పదిరోజులలో— మొత్తం 1700 మంది ఆత్మహత్య చేసుకున్నారు!

హిట్లరు పరిపాలనకింద బ్రతుకు భారం అవుతుందనే నమ్మకంతోనే ఇంతమందిప్రజలు యీవిధంగా తమ చేతులతోనే తమ ప్రాణాలను తీసుకున్నారు. వారి నమ్మకము నిజమైనదని వెంటనే ఋజువైనది కూడా! హిట్లరు అడుగుపెట్టడమేమో, అరెస్టులు, ఆస్తిజప్తులు, లాఠీచార్జీలు, ఉరిశిక్షలు ప్రారంభం కావడమేమో! మానవహింసకు— ప్రత్యేకంగా యూదుల హింసకు— హిట్లరు పేరుపొందినవాడు. అయినా ఆస్ట్రియాలో అతడు చేసిన ఘోరకృత్యాలను చూస్తే, అతడి పూర్వపు దౌర్జన్యాలే సౌమ్యంగా కనపడతాయి.

ఆస్ట్రియా ఆక్రమణ

ఇంతగా ప్రజల్ని బాధించిన తర్వాత, అతడు ప్లెబిస్సైట్ జరిపి, దానిలో జర్మనితో ఐక్యతకు ఆస్ట్రియావారి వద్దనుంచి నూటికి నూరు వోట్లను సంపాదించాడు.

ప్లెబిస్సైట్ ఫలితం తెలియగానే, "ఇంతకుపూర్వం మనది జర్మన్ రాజ్యం; ఇప్పుడు జర్మన్ మహారాజ్యం" అనే ధోరణిలో అత డొక ప్రకటన చేశాడు.

ఆస్ట్రియా ఆక్రమణతో జర్మనీ మహారాజ్యమైనది. పోనీ, దానితో హిట్లరు రాజ్యతృష్ణ పరితృప్తిపొందిందా? లేదు. అత డిప్పుడు జెకొస్లొవాకియాకూడా కావాలంటున్నాడు.

ఆస్ట్రియా విషాదగాథ ముగిసింది. ఇక జెకొస్లొవాకియాగతి.........?

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA103B199 |
| పుస్తకం పేరు | ఆస్ట్రేలియా [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 161 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | II,B ,150 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |